# అమృతాంజనము



ఎట జూచిన అంజనముల వరదలె
ఎట గాంచినను బాముల బురదలె
బాధా నిర్మూలన మను కళలో
అమృతాంజన సామ్యము లేదిలలో.
పేరులు చూస్తే బారెడు పొడుగులు
మేరలు చూస్తే జానెడు గిడుగులు
బాముఃలుకూర్ల్యంజనములు టోనులు,
ప్రజలను ఆకర్షించే ఝోనులు.
అమృతాంజనము అనాది ప్రసిద్ధము
బాధా వారణ కంకణబద్ధము
సకల వ్యాధుల సన్నాహమ్ముల
పెకలించును ఆ దేవతయమ్ములు.
తల నొప్పికిని కీళ్ల నొప్పికి
పడిసెంబుకు రొంపకు దగ్గులకు
అమృతాంజన మర్దన పరిచర్యయె
అది శీఘ్రు నివారణ సాధనము.
చౌకకు చౌక, గుణముఃకు గుణము
సరసనుగల ప్రతిషాపున దొరకును
సులభంబుగ ఇంటికి విచ్చేసి
నెలకొనగల గృహవైద్యుం డీతడు.
నామము చెవులకు రంజనమైతే
వారణ మేనికి రంజనము
బాధలకెల్లా భంజనము
వ్యాధుల పులి అమృతాంజనము.

గరిమెళ్ల సత్యనారాయణ బి. ఎ.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయముమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించు
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యస్. కేసరి.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨3]    జనవరి 1954    [సంచిక ౧

# విషయసూచిక



# మనవి

ఈ నెల 15వ తేదిన వెలువడవలసి యున్న యీ సంచిక హఠాత్తుగా అనుకోకుండా ఏర్పడిన ముద్రణాలయపు మరమ్మతుల వలన 20వ తేదీన వెలువడవలసి వచ్చినందులకు పాఠకులు, అభిమానులు క్షమింతురుగాక !

సంపాదకుడు.



సంక్రాంతి సంబరం




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# స్వ వి ష య ము

నూతన సంవత్సరము, సంక్రాంతి వేడుకలతోబాటు మా 'గృహలక్ష్మి' 23 వ సంపుటపు ప్రథమ సంచికగా దీనిని మీ కరకమలముల నలంకరింప జేయుచు పాఠకులను, రచయితలను, రచయిత్రులను యీ సందర్భమున అభినందిస్తున్నాము.

'గృహలక్ష్మి' వ్యవస్థాపకులు పూజ్యులు కేసరిగారు లేకుండా దొర్లిపోతున్న తొలి సంక్రాంతి యిది. యావదాంధ్ర ప్రజానీకం యొక్క ఆదరాభిమానములతో, సహకార సద్భావములతోబాటు స్వర్గీయ కేసరిగారి అవ్యాజమైన పితృప్రేమతో 22 సంవత్సరములుగా వర్ధిల్లుచూ వచ్చిన 'గృహలక్ష్మి'కి యీ నాడు ఏర్పడిన కొరత చెప్పతరముకానిది.

ఈ సందర్భమున అభిమానులు, శ్రేయోభిలాషులు 'గృహలక్ష్మి' పురోభివృద్ధి పట్ల ప్రత్యేకమైన ఆసక్తిచూపి ఆదరించవలసిన ఆవశ్యకత యీనాడు మరింత హెచ్చయింది. అన్నివిధాల మహిళా పురోభివృద్ధికి, మహిళా ఉద్యమవ్యాప్తికి అకుంచలమైన దీక్షతో కృషిచేయుచున్న 'గృహలక్ష్మి' పత్రికను భవిష్యత్తులోకూడ తమ

స్వప్రయోజనాలకు ఆంధ్ర ప్రజానీకం – ముఖ్యంగా మహిళాలోకం వినియోగించుకో కలుగడం అవసరం.

అభ్యుదయ రచయితలకు, రచయిత్రులకు మా పత్రిక యిచ్చుచున్న ప్రోత్సాహము పాఠకులకు తెలియనిదికాదు. విజ్ఞానవికాసములను పెంపొందిస్తూ, వినోదాన్ని సమకూరుస్తూన్న అమూల్యమైనవ్యాసములు యీపత్రికలో వెలువడుతున్నవి. పత్రికా పురోభివృద్ధి దృష్ట్యా పాఠకుల సూచనలను, సలహాలను కృతజ్ఞతా పూర్వకంగా ప్రజల అభిరుచులననుసరించి మరింత ఆకర్షణీయంగా 'గృహలక్ష్మి' వర్ధిల్లడానికి స్వీకరించి అమలు జరుపుటకు తప్పక ప్రయత్నించెదము.

# సంక్రాంతి సందేశము

శ్రీమతి వడ్డి కృష్ణవేణి

రావమ్మ గృహలక్ష్మి రయముతోడ,–ఆంధ్ర సారస్వత ఆదర్శలక్ష్మివమ్మ
ఆంధ్ర మహిళల ఆనందింపరమ్మ,–గృహలక్ష్మి నా సందేశమిదియె నీకు ॥

విజ్ఞానమును వృద్ధి చేయు,–స్త్రీలపాలిటి శిరోభూషణంబ
ఆంధ్ర మహిళలను ఆశీర్వదింపరమ్మ,–గృహలక్ష్మి నా సందేశమిదియె నీకు ॥

వేడ్కతో గృహములు వెల్లివిరియ,–పరమపావనమైన పుష్యమాసమున
సంక్రాంతి వేడుకలు సఖియలందరు,–ముదముతో చేతురు ముచ్చటగను ॥

పచ్చని చేలతో, పాడిపంటలతో,–నంది గొబ్బిళ్ళతో పాపలు సంతోషమున,
సర్వజనాహ్లాద కరమగు సంక్రాంతి,–వేడుకలు సంతస మొదవుచుండె ॥

కర్షకులు కోడిపందెములనచు,–అల్లుళ్ళు అత్తవారిండ్లకనచు
పల్లెల, పట్నములందు సంక్రాంతి–పండుగ సంతోషము గూర్చె ॥

వీధులయందు ధాన్యలక్ష్మి– విజయ విహారముచేయుచుండ,
భారతావని భాగ్యసీమకు,–వచ్చింది సంక్రాంతి ముదము గూర్ప ॥

# గొబ్బెమ్మ

శ్రీమతి పు. బాలాత్రిపుర సుందరమ్మ

ప్రొద్దున్న ఆరుగంటలకు మధ్యగదిలో మజ్జిగ చేస్తున్నాను నేను. ఆ ప్రక్కనే దొడ్డిగోడ వెంబడి బుట్టెడు పేడ వేసుకుని గొబ్బెమ్మలు చేస్తున్నది మా విమల. ఆ పేడ ముద్దలకు ఇల్లా పాట పాడు తోంది.

పాట

గొబ్బియలో గొబ్బియాని పాడరమ్మ నిబ్బ
రంపు చేడెలార ॥గొ॥
గొబ్బి దేవర కూతురి పేరు నీలగిరికన్య ॥గొ॥
నీలగిరి కన్యకు నిత్యమల్లెతోట ॥గొ॥
నిత్యమల్లెతోటకు మంచినీళ్ల బావి ॥గొ॥
మంచినీళ బావికి మంచిగంధపుగిలక ॥గొ॥
మంచిగంధపుగిలకమీద వెండితాడు వేసి ॥గొ॥
వెండితాడు చివరకు చిలకల్ల చెంబు ॥గొ॥
చిలకల్లా చెంబొచ్చి మ చినీళ్ళ బావిలో
బుడుగుబుడుగు మునక ॥గొ॥
బుడుగుబుడుగుమునకకు జీడిగింజ ద్రిష్టి ॥గొ॥

అని యింకా యేమేమో పాడుతున్నది మా విమల. ఇంతలో పదిమంది పిల్లలు చేరారు చుట్టూను. తలా ఒక మాట మొదలు పెట్టారు. యేమున్నాయి వాళ్ళమాటలు? వాళ్ళల్లో ఒక్కత్తె యిల్లా అంటున్నది గొబ్బెమ్మలకు నైవేద్యం ఏం పెట్టావా అని ఇంకొకతె. నువ్వేం పెట్టావె అని ఒకతె. "నాకు రేగు పండ్లు యిష్టమని మా అమ్మ కొనిఉంచి రోజూ కొన్ని పండ్లు యిస్తూఉంటుందే. నేను అవి నైవేద్యం పెట్టి మా చెల్లాయికి చిట్టిబాబుకన్న పెట్టకుండా నేనే తినే స్తాను." ఇంకొకతె మా అమ్మ మీగడ గిన్నెలో పెట్టి యిస్తుంది అది నైవేద్యం పెట్టి అన్నందగ్గరకు తెచ్చుకుంటాను; మా బామ్మ గోంగూరపచ్చడి కలుపగానే నేను నంచేసుకుంటా అన్నది. ఇంకొకతె "మా అమ్మ పెరుగుగిన్నె యిస్తుంది అది నైవేద్యం పెట్టి నేను మా చెల్లయి అన్నంలో వేసుకుంటాం" అన్నది. యింకొకతె "మా నాన్నగారు రాత్రిపూట తెచ్చిన కారపూస పొట్లము నైవేద్యం పెట్టి అది నేను, మా చిజ్జిబాబు పంచుకుంటామన్నది. యింతలో మా విమల [illegible]కుని యిల్లా అంటున్నది.—"అయ్యో బజారు కారపూస గొబ్బెమ్మలకు నైవేద్యం పెట్టకూడదటే సీతా! నేనొకనాడు అలా అంటేను, మా నాన్నగారు చెప్పారు, యివి వట్టి పేడముద్దలు కాదు యివి పెద్దదేముడు అని, వీటిని గురించి నాకొక కథకూడా చెప్పారు" అన్నది. ఇంతలో అక్కడే ఉన్న ప్రక్క యింటివాళ్ళ చిట్టి అన్నది "ఆ కథ యేమిటో మాకు చెప్పవే" అని. మా పిల్లను [illegible]న్న అడిగితే చాలు. తనకు వచ్చిన ఆటగాని, పాటగాని, కథగాని వెంటనే చెప్పేస్తుంది. యిక మొదలు పెట్టింది తనకు వచ్చి రానికథ.

పూర్వకాలం బలిచక్రవర్తి అనురాజు మన దేశాన్ని పాలించేవాడట. ఆ రాజు చాలా దాన ధర్మాలు చేసేవాడట. యేవి అడిగినవాళ్ళకు అవి లేదనకుండా ధర్మం చేశేవాడట. చాలా యాగాలు క్రతువులు చేసేవాడట. యిల్లా కొంతకాలం చెయ్యగా చెయ్యగా ఆయన పుణ్యం యెక్కువై పోతున్నదని కృష్ణపరమాత్ముడు కనిపెట్టి ఈ రాజును యెల్లాగైనా మాయచేసి మోసగించాలనే ఉద్దేశ్యముతో ఒక పొట్టి బ్రాహ్మణవేషం వేసుకొని తాను కూడ యజ్ఞశాలలో బ్రాహ్మణులసందున కూర్చున్నాడట. "ఏ కృష్ణుడె? మన గోవిందమ్మ తమ్ముడా?" అన్నది మరీ తెలియని కాంతం. అందరు పకపక నవ్వారు తమకు తెలిసినట్లు. యింతలో మా విమల అందరికంటె గొప్పదానిలాగ "ఏమిట్లా కథ చెప్పవా వద్దా" అన్నది విసుగ్గా. అప్పుడు యెదిరింటివారి సరో

జిని అందర్నీ నిశ్శబ్దంగా కూర్చోబెట్టి "నీకెందుకు నీవు కథ సాంతం చెప్పవే" అన్నది మావిమలతో. మళ్లీ కథలోకిదిగి "విమలన్నది అందరు నవ్వితే పాపం చిన్న బోయిందే కాంతం, అందరు నవ్వారుగాని అసలెవ్వరు చెప్పారుకారుగదా? దానికనే చెపుతున్నా విను కాంతం" అని మళ్ళీ యిల్లా మొదలు పెట్టింది విమల.

కృష్ణుడు అంటే దేముడు అంటారే. యశోద కొడుకు ఆకృష్ణుడే మాయవేషంతో వచ్చి సభలో కూర్చుని అందరు అన్నీ అడిగితే తనులేచి అడిగాట్ట నాకుకూడ ఒక దానం యివ్వండి ప్రభూఅని. అప్పుడు ఈ రాజుగారు నీకు యేంకావాలి అని అడిగాట్ట. అప్పుడు ఈ మాయ కృష్ణుడు నాకు మూడడుగులం భూమిదానం యివ్వండి చాలు అన్నాట్ట. చక్రవర్తి సరే అన్నాట్ట. అప్పటి కప్పుడే తనమాయచేత భూమి అంతా రెండు అడుగులక్రింద సరిపెట్టి మూడో అడుగు ఏది అన్నాట్ట. అప్పుడు చక్రవర్తి తన తల మీద మూడో అడుగు చూపారట. అడుగుతోనే చక్రవర్తిని పాతాళానికి త్రొక్కాడుట కృష్ణుడు. అప్పుడు సరోజిని అడిగింది "పాతాళమంటె యేమిటే విమలా!" అని. "మనం ఉన్న ఈ లోకంకాక మన కాళ్ళకింద ఉన్న లోకాన్ని పాతాళలోకం అంటారు" "అయితే విమలా! మనకాళ్ళకింద మట్టి త్రవ్వితే కుక్కమూతివాళ్లు ఉంటారు అనుకుంటామే మనం అది నిజంకాదూ" అన్నది చిట్టి తన తెలిసీ తెలియని జ్ఞానంతో. "అవన్నీ మనం పిల్లలం చెప్పుకునే పిచ్చి కబుర్లే" చిట్టీ అన్నది. విమల 'నే చెప్పేకథలు నిజం కబుర్లు. మానాన్నగారు చెప్పినవి ఒక్కటికూడా బద్ధం కాదు. యింతకు నాకథ శాంతంగా వినరా? అయితే లేవండి వెళదాం.' 'ఊ చెప్పు విమలా' అని దాన్ని ప్రోత్సహించి అందర్నీ కసరి దాన్ని చెప్ప నియ్యండె కథ బాగుంది అని నిశ్శబ్దంగా కూర్చో బెట్టింది సరోజిని. మళ్ళీ కథ అందుకుని విమల యిల్లా చెప్పుట మొదలు పెట్టింది.

అప్పుడు బలిచక్రవర్తి ఆ లోకానికిపోయే సమయంలో కృష్ణుణ్ణి అడిగాట్ట "మహానుభావా! నా అజ్ఞానంవల్ల నిన్ను తెలుసుకోలేకపోయాను యిక నాగతేమిటి? చెప్పవలసింది" అని. అప్పుడు భగవానుడు ఆయనకు చెప్పాట్ట. "నీవు సంవత్సరానికి మూడు రోజులు స్వేచ్ఛగా భూలోకానికివచ్చిఉండి నాలుగవరోజు వెళ్లిపోయేటట్లుగా అనుజ్ఞ ఇస్తున్నాను" అని చెప్పి చక్రవర్తిని పాతాళానికిపంపి కృష్ణభగవానుడు అంతర్ధానమైనారట. "అందుకని మనము సంక్రాంతి పండుగని సంకురుమయ్య అని చెప్పుకుని మట్టితో బొమ్మనుచేసిపెట్టి పిండివంటలుచేసి నైవేద్యము పెట్టటము, ఆయనకుట. సంవత్సరానికి మూడురోజుల మాత్రమే ఈ పండుగ. అది యీ పండుగకథ. మానాన్నగారు చెప్పారు" అన్నది విమల అందరికంటె తనకే తెలుసుననే భావం వెలిబుచ్చుతూ. యింతలో సరోజిని అందుకుని యిల్లాంటి కథ మాబామ్మకూడా ఒకమాటు చెప్పిందోయి, అదీ యిల్లాగే ఉంది. ఏమిటంటే మాదొడ్లో పాదులుత్రవ్వి పొట్లా, కాకర, తోటకూరగింజలు మొలవేస్తె వాటికంటె ముందుయింకేవో మొక్కలు మొలుస్తాయి అని యేమిటని మా బామ్మను అడిగితే మా బామ్మ చెప్పిందిగదా "ఒకప్పుడు బలి చక్రవర్తి అనేరాజు మన దేశాన్ని పాలించేవాడట ఆయన పాలించే రోజుల్లో అన్ని వస్తువులు సమృద్ధిగా దొరికేవిట. ప్రజలంతా కష్టపడకుండా తినేవాళ్ళాట. యీ విధంగ మనలను సౌఖ్యంగా కాపాడే చక్రవర్తి పాతాళలోకానికి వెళ్ళిపోతున్నారట, ఒకప్పుడు. అప్పుడు ప్రజలంతా మాగతేమిటి అని మొర పెట్టుకున్నారుట, అప్పుడు ఈ చక్రవర్తి చెప్పేరట గదా మీరు యెల్లప్పుడు తినుటకు పనికివచ్చే తినుబండపు విత్తనములు తెచ్చుకోండి, అవి నేనుచల్లి వెళ్లుతాను. మళ్లీ మీరు చల్లుకోకుండా, కష్టపడకుండా యెప్పుడు పండించుకుని తినవచ్చునన్నాడుట. అప్పుడు ఈ ప్రజలంతా తమరు తినే గింజలన్నీ తీసుకువెళ్లు చుండగా భగవంతుడు కనిపెట్టి ఈ రాజు యిల్లా చేసి వెళ్ళితే ప్రజలంతా సోమరిపోతులైపోయి పనిపాట్లు మరిచిపోతారు అని ప్రజలువెళ్లే దారిలో ఒకచోట వాళ్ళకు ఏదో వేషంతో ఎదురుగావెళ్ళి అడిగారట, "మీరంతా యెక్కడికి వెళ్లుతున్నారు?" అని ఈ

అమాయిక ప్రజలు ఉన్నసంగతంతా చెప్పారుట, అప్పుడు ఈ మాయవేషధారి అన్నాట్ట.

'అయ్యో! పాపం వెళ్ళేవాడు ఊరికే వెళ్ళక మీకు తిండికూడా లేకుండాచేసిపోవటానికి ఇలా చెప్పాడు గనుక ఆ గింజలు పారపోయండి ఇవిగో నేను యిచ్చే గింజలు తీసుకెళ్ళి ఆయనకు యివ్వండి' అని వాళ్ళచేత ఆ గింజలు పారపోయించి పిచ్చి మొక్కల గింజలన్నీ వాళ్ళచేతులో పెట్టి వెళ్ళిపోయినాడట, ఈ ప్రజలు ఆ విత్తనములు తీసుకొని రాజు దగ్గిరకు వెళ్ళారుట, అవిచూచి అయ్యో మిమ్మలను యెవరో మోసంచేసినట్లున్నది, ఈ విత్తనములు యేమిటి? మీరు తినేవేనా? అని రాజుగారు అడిగాడట, అప్పుడు ప్రజలు జరిగిన సంగతంతా చెప్పారుట, అప్పుడు రాజుగారన్నాట్ట మీ ఖర్మ-మీరు యివి తెచ్చుకున్నారు గనుక యివే చల్లిపోతాను అని అవేచల్లి వెళ్ళాట్ట ఆ చక్రవర్తి. అందుకని మనకు ఎప్పుడు దొడ్లల్లో యేవో మొక్కలు మొలుస్తునే ఉంటాయి" అని మా బామ్మ చెప్పింది. యేమోయి విమలా! నిజమేనా? "యేమో నాకు మాత్రం యేంతెలుసు పెద్దవాళ్ళు అబద్ధం చెపుతారా? వాళ్ళు అన్నీ చదువుకుంటారు గనుక తెలుస్తాయి. అయ్యో ప్రొద్దెక్కిందే సరోజిని" అని గొబ్బెమ్మలు చేతబట్టుకుని, వీధిలోకి పరుగెత్తి ఒక్క కేక వేసింది విమల అమ్మా అని. నేను వెంటనే వాకిట్లోకి వెళ్ళాను నావంకచూసి ఇవ్వాళ నేను చాలా గొబ్బెమ్మలుచేస్తే నువ్వు చిన్నముగ్గు వేశావేం అన్నది. దానిష్ట ప్రకారం ఇంకోపెద్ద ముగ్గువేసి దానిచేత చాలు అనిపించుకుని దాని ఉత్సాహానికి భంగం లేకుండా ఇంట్లో కొచ్చాను.యింతలో వాకిట్లో గుఱ్ఱం బండి ఆగింది. కేరింతలుకొడుతూ, పరుగులెత్తుతూ 'నాన్నగారొచ్చారు అమ్మా' అని ఇంట్లోకి వస్తున్నది మా విమల. నేను వెనక్కు తిరిగిచూసి అలాగే నిలబడ్డాను హాల్లో. నాలుగురోజుల కొస్తానని నిన్న వెళ్ళి యివ్వాళే వచ్చారేమా అని కొంచం భయం కలిగింది నాకు. వళ్ళు సుస్థియేమన్నా చేసిరాలేదు గదా అని అల్లాగేచూస్తు నుంచున్నాను. ఇంతలో బండిలోనుంచి మా చెల్లెలుకూడా దిగింది-సరే ఇందుకని వెంటనే వచ్చారు కాబోలు అని మనశ్శాంతి కలిగింది నాకు. వారు ఇంట్లోకొచ్చి కోటు, సూటు విప్పి కాళ్ళుకడుక్కున్నాక మావాళ్ళింట్లోవి, వారి ప్రయాణపు క్షేమసమాచారములు క్లుప్తంగా అడిగి ప్రొద్దెక్కిందని వంటచేయటానికి వెళ్ళాను. విమలకు శలవులు గనుక ఆడుకోటానికి వాళ్ళపిన్నినికూడా కలుపుకుని వెళ్ళింది.

౨

మధ్యాహ్నం భోజనాలయాక న్యూస్ పేపరు చూస్తూ గదిలోపడుకున్నారు మాపంతులుగారు. నేను వంటయింటి పనులన్నీ సర్దుకునివచ్చి యెదురుగాఉన్న కుర్చీలో కూర్చున్నాను సావకాశంగా ప్రయాణపు సంగతులు విపులంగ అడగడానికి. ఇంతలో పేపరవతలకుతీసి "విమలేది" అన్నారు.

"యివ్వాళేదో తీరని పనిలోఉంది."

"అయితే నాలుగురోజులు పని ఉన్నదని అట్టహాసంగావెళ్ళి యివ్వాళే వచ్చేశారేం?"

"నేను వెళ్ళిన ఊళ్ళో పనికాలేదు బెజవాడ వచ్చేసరికి అక్కడ చక్కని కొండపిల్లి బొమ్మలమ్ముతున్నాయి అవి చూసేసరికి బొమ్మలపండుగ,అమ్మాయి జ్ఞాపకంవచ్చి బొమ్మలు కొన్నాను. అవికొని గవర్నరుపేట మీవాళ్ళింటికివచ్చేసరికి మీ చెల్లెలు కాంతంవస్తానన్నది. మీ అమ్మ వద్దంటున్నదిగాని అది వినలేదు. నేనుకూడ రమ్మన్నాను యిద్దరు బొమ్మలు పెట్టుగుంటారుగదా" రేపే భోగి అని బొమ్మలుచూస్తే అమ్మాయికి చాలా సంతోషం.

"ఏది పిలు."

"అయితే నాపట్టుచీర మాటేంచేశారు?"

"యేంచేస్తాను? బెజవాళ్లోకూడా దొరకలేదు ఈ మాటు మెడ్రాసువెళ్ళినప్పుడు తెస్తాను."

"సరే ఇల్లాగే వాయిదాలు వేస్తుంటేసరి మళ్ళీ పండుగకూడా వస్తుంది. నిరుడు సంకురాత్రి పండు

గకు తెస్తానన్న మాటలు యింతవరకు తేవటానికి వీలుకాలేదు-పోనీయండి. యిక నేనడగనే అడగను” అని కుర్చీలోనుంచి లేచివెళ్లబోతుంది.

“ఆ ఆగు కొంచం అంత కోపమా ?”

“కోపమెచ్చినేనేం చేశాను ?”

“నువ్వేం చెయ్యాలి ? నీ ఉద్రేకము నీ ముఖ లక్షణాలే చెపుతున్నాయి. నీ చీరమాట అడిగావు గాని విమలకేవన్నా పరికిణిలు జాకెట్లు తెచ్చారా ? బెజవాడలో రెడిమేడు షాపుల్లో మంచి ఉంటాయి అని ఏమన్నా అడిగావా ?”

“నేను చెప్పకపోయినా మీరు తెస్తారని నాకు తెలియును. లేకపోతే మాత్రం ఇక్కడన్నా తీసుకు రాకపోతారా ?”

“తీసుకురాక తప్పుతుందా ?”

“నీకు మాత్రం తేకతప్పుతుందా ?”

“తప్పకేంచేస్తుంది ? యిన్నాళ్లనుంచీ తేకపోతే తప్పలేదు ?

“పెద్దచీర రెండువందల ఖరీదుగనుక కొంచం ఆలశ్యమైంది. నేను చెప్పిందాక ఆగలేకపోయావు గాని, అదుగో ఆ బొమ్మలబుట్ట దాని ప్రక్కనేఉన్న పెద్దసంచి ఇల్లా ఇయ్యి. ఈ చీరెనా నీవు చెప్పింది ? రంగు నీకు నచ్చిందా ? పరికిణీలు, జాకెట్లు బాగు న్నాయా ? విమలకొకటి, కాంతానికొకటిను సరి పోతాయేమోచూడు” అంటూ కూతుర్ని పిలిచారు తండ్రి.

“యెందుకు నాన్నగారు పిలిచారు ? యివ్వాళ మీ దగ్గిర చదువుకోటానికి తీరుబడికాదు. బొమ్మలు సర్దుకుంటున్నాను” అని ఒక్కపరుగునవచ్చి తండ్రి నానుకుని నుంచున్నది విమల.

“పాతబొమ్మలేం సర్దుతావు, కొత్త బొమ్మలు తెచ్చాను చూశావా” అన్నారు తండ్రి. యేవి అని బుట్టలో బొమ్మలు ఒకొక్కటే పైకితీస్తు “యేవి నాన్నగారు ఆ రోజున మీరు కథ చెప్పారే కృష్ణుడు బలిచక్రవర్తి ఆ బొమ్మలుండవు” అన్నది విమల బొమ్మ చేత్తోపట్టుకుని తండ్రివంకచూస్తూ. ఇంతలో నాకు ప్రొద్దుటి సంగతంతా జ్ఞాపకంవచ్చి జరిగిన సంగ తంతా చెప్పాను వాళ్ల నాన్నగారికి.

అప్పుడు వాళ్ల నాన్నగారు “మా అమ్మాయి యెంత బుద్ధిమంతురాలు యెంత తెలివికలదో చూశావా ? పదేళ్లునిండలేదు! యీడాదినాడు నేను చెప్పినకథ పిల్లలకు పూసగ్రుచ్చినట్లు చెప్పింది. బొమ్మలు చూసినాకూడా ఆ దేముళ్ళ సంగతే అడిగిందిగాని పరి కిణీలు, జాకెట్లు తెచ్చావా అన్నదేమోచూడు ? నీలాగ. సంక్రాంతిసారం అంతా మూడుముక్కలకథ లోను, ఆ రెండుబొమ్మల్లోను యిమిడ్చింది మా అమ్మాయి. లేక నీవు పట్టుచీరకొనడం, నేను సిల్కు సూటు వెయ్యడముగాదు పండుగ మా అమ్మ చెప్పిందేనిజం” అని కూతుర్ని చేరదీసి చెక్కిళ్ళు నిమురుతూ ముద్దాడారు తండ్రి.

“మానాన్నగారికి నేను మంచిదాన్నే! యెవరి పిల్లలు వాళ్ళకు చెడ్డవాళ్ళుకారు” అని అంటూ కాఫీ వేళైందని అగ్గిపెట్టె చేతబట్టుకొని వంటింట్లోకి వెళ్ళాను నేను. కొత్త బొమ్మలబుట్ట చంకబెట్టుకొని తోటిపిల్లలకు చూపించటానికి హాల్లోకెళ్ళింది విమల. పేపరు పూర్తిచేయుటానికి మళ్ళీ పేజీలు తిరగేస్తు న్నారు మా పంతులుగారు.

# సంక్రాంతి ఉపదేశం

మిస్. నిరుపమగురుకుల్

మహాలక్ష్మమ్మ సంసారం పాల సంద్రము వంటిది. కొడుకులు, కోడళ్ళు, కూతుళ్ళు, అల్లుళ్ళు, మనుమలు, మనుమరాళ్లు అందరూ ఎంతో సరదాగా గలగలమనిపిస్తుండేవారు ప్రతిపండక్కీ! మహాలక్ష్మమ్మగారి ఆఖరి కూతురు అనూరాధ. అనూరాధ నాన్నగారు బ్రతికున్నపుడే కూతుళ్లకు కొడుకులకు పెళ్లిళ్లు చేసివేసారు కాబట్టి మహాలక్ష్మమ్మ ఆనందంతో కాలం వెళ్లబుచ్చుతోంది. కానీ అనూరాధని కూడా అందమైన వాడికే ఇచ్చివుంటే ఆమె కేచింతలేకుండా వుండేది, కానీ పిల్లవాని గుణం ప్రధానమని అందంతో అవసరంలేని రామయ్యగారు చక్కని చుక్కవంటి అనూరాధని 'మూర్తి' కిచ్చి పెళ్లిచేసారు. ఆ పెళ్లి మహాలక్ష్మమ్మకు కూడా ఇష్టం లేదు. కానీ భర్తకెదురాడే గుణం ఆమెలో లేదు. ''మూర్తిగుణం చాలామంచిదని, నీ అల్లుళ్ళందరిలో మూర్తి చాలామంచివాడు, నీ కొడుకులకన్నా ఎక్కువగా మూర్తిని చూడాలినీవు'' అని చెప్పాడు రామయ్య. కానీ అసంతృప్తిగా నవ్వింది మహాలక్ష్మమ్మ.

తల్లిమూలాన భర్తంటే ఒకవిధమైన అసహ్యాభావం ఏర్పడింది అనూరాధకి. మూర్తి మాట్లాడించినా మాట్లాడక ఒకవిధంగా అతనికి మనసీక పడక టింట్లో రెండుమంచాలు వేయను అవకాశమిచ్చింది. మూర్తి మొదట్లో ''చిన్నతనం'' అనుకొని ఆఖర్న ''చక్కటి అనూరాధకి తన కురూపితనం తనమీద అయిష్టమని, అంచేత ఇష్టంలేని పెండ్లి, మనసులేని కాపురం'' అనుకొన్నాడు..

అది మొదలు అనూరాధతో మాటలు తగ్గించివేసాడు. భార్యభర్తలు ఎడమెడ ముఖంతో వుండడంచూచి అనూరాధ అత్తగారు, మామగారుకూడా ఆ విషయంగా ఏమి చెప్పలేకపోయారు. కోడలికి ఏవిధానా చెప్పలేక అనూ అత్తగారు గుటకలు మింగుతూనే కూర్చుంది ఆరునెల్లూ;

సంక్రాంతి పండుగకు మహాలక్ష్మమ్మ ఇల్లు కలకలలాడింది. తొలిసంక్రాంతికి ''మూర్తి''ని రమ్మని రాసారు. కానీ మూర్తి తనతమ్మునితో అనూరాధని మాత్రం పంపాడు. అత్తారింట్లో తనకు 'విలువ' లేదని.

అనురాధ పెద్దన్న మాత్రం ''నీమొగుడు రాలేదేమ్మా?'' అని అడిగాడు.

పెద్దవదిన అందుకొని ''ఆఁ ఎందుకు ఇంతమందిలో దిష్టి బొమ్మలావుండాలా. నీకునాన్నగారికి అందచందమే తెలియదు'' అనిఅన్నది.

పెద్దన్నవూరుకొన్నారా - అన్నాడు

కదా "అవును శారదా! మా నాన్నకి అందచందాల మాట తెలియదు తెలిస్తే నిన్ను కోడలుగా తెచ్చుకోనేవాడా?"

దీంతో అనూరాధకి తానో సమస్యలో ఇరుక్కొన్నట్టయింది. అక్కడినుండీ వెళ్లిపోయింది. కానీ అమ్మదగ్గర ఎదురింటి రామమ్మగారు కూర్చునివున్నారు. ఆవిడ అనూరాధని చూడగానే "అల్లుడు పండక్కి రాలేదేమివదినా"! ఆఁ అయినా అమ్మాయికి తగ్గవాడుకాడమ్మా విధి లిఖితం మనమేంశేద్దాం" అన్నది. అనూరాధకి ఏడ్పువచ్చింది. అక్కడినుండీ వంటగదిలోకి వెళ్లింది. రెండోవదినా వంట చేస్తోంది. ఆడబిడ్డ కంటినీరుచూచి ఆవిడ ఏమనుక్కొందో మూడోవదినతో అంటూండడం విన్నది స్పష్టంగా అనురాధ.

"మొగుడు రాలేదని బెంగో ఏమో అందమైన మొగుడు రాకపోతే ఏం?" అనూరాధ వినలేకపోయింది.

చిన్నన్న వీధిగదిలో కూర్చునివున్నాడు అనూరాధ అక్కడికెళ్లి కూచుంది "పండుగపూట అదేంకన్నీళ్లు రాలుస్తున్నావేం!" అని అడిగాడు చిన్నన్న.

అనురాధ చప్పున కన్నీరు తుడుచుకొని మాటమార్చింది. "అదిసరే అన్నా! లక్ష్మిని నీవు చేసుకుంటావని చెప్పావా?" అని కొంచెం ఆశ్చర్యంతో అన్నది.

చిన్నన్న నవ్వాడు "అవును, ఏం? లక్ష్మిఅందంగాలేదనా; నీ ఆశ్చర్యం?"

అనూరాధ సిగ్గుపడ్డది "కాదన్నా: కురూపులలో మొదటి స్థానం లక్ష్మిది అని నా అభిప్రాయం. అలాంటి అమ్మాయిని నీవు ఒప్పుకొన్నావంటే నా కాశ్చర్యం వేసింది నేనునమ్మలేక పోయాను"

"అందంలో లక్ష్మి జాబితాకాదనుకో ఆ పిల్లగుణం ఎటువంటిదో తెలుసా; గుణం లేని అందం మొండిగోడకు సున్నంకొట్టినట్లవుతుంది. ఆమాటకొస్తే నీవు మూర్తిని పెళ్లాడలేదా; చక్కగానే కాపురంనీవు సాగించుకోలేదా ఏమిటి! నీవు మూర్తితో ఏంచేస్తున్నావు? అందము; గుణము?" చిన్నన్న అడిగిన ప్రశ్నకు అనురాధ ఏం జవాబు చెపుతుంది!

చిన్నన్న తిరుగా అన్నాడు "చూడు రాధా క్షణభంగురమైన అందాలతో నిమిత్తం పెట్టుకొని ఏంబావుకొంటారు? అందమైన దాన్నే ఏరికోరి పెళ్లాడుతాను అనుకో; ఆ పిల్ల మధ్యలో స్ఫోటకమొచ్చో ఏదోవిధంగా కురూపి అవుతుంది. అప్పుడేం చెయ్యాలి! ఇది అందంగాలేదు అని కట్టుకొన్నదాన్ని విడిచివేయనా? లేదామరో అందకత్తెతో పెళ్లి సాగీయనా? అందంగావుంది మొన్ననేచూచిన డాక్టరుగారమ్మాయి. కానీ గుణం తిన్నగాలేని

(50 పుట చూడుడు)

# కళ్యాణి

మూలం
శ్రీమతి సుభద్రాకుమారిచౌహాన్

అనువాదం
శ్రీమతి నాగళ్ల రామశేషమ్మ

[రాధారమణ రైల్వే ప్రమాదంలో చనిపోతూ తన భార్య కళ్యాణిని జయకృష్ణునకు వప్పజెప్పుతూ ఆమెను కష్టం కలుగజేయకుండా కాపాడి, యిష్టపడితే మరల వివాహం చేయమని కళ్లుమూసాడు. కాని కళ్యాణి దురదృష్టాన్ని అవకాశంగా తీసి నలుగురూ నాలుగు విధాలుగా మాట్లాడసాగారు. లోకాన్ని చూచి జయకృష్ణుడు చలించక పోయినా అతని భార్య మాలతి 'కళ్యాణిని పంపివేయండి, ఆమె ఉనికివలన మన కుటుంబానికే ఆపదరావచ్చును' అని పోరు పెట్టడం మాత్రం చీకాకు కలిగించేది. తాను తన స్నేహితునికి మాటయిచ్చిన ప్రకారం కళ్యాణిని కాపాడి ఎదో మార్గం ఏర్పరచడం తన విద్యుక్త ధర్మంగా భావించాడు. కాని కళ్యాణి అందచందాలు విశేషంగా జయకృష్ణను ఆకర్షించి తానే ఆమెను పునర్వివాహం చేసికోవాలని యూహించాడు. కళ్యాణి సయితం జయకృష్ణను ప్రేమించింది కాని తానతనిని వివాహం చేసికొని ఆపత్సమయంలో తన్ను కాపాడిన జయకృష్ణ కుటుంబానికి, ముఖ్యంగా అతని భార్య మాలతికి ద్రోహం తలపెట్టలేకపోయింది — యికచదువండి]

(గతసంచిక తరువాయి)

ఇష్టంలేకపోయినా కళ్యాణిని యింట్లో ఒంటరిగ వదలి వెళ్లక తప్పలేదు. వంట మనిషికి అన్ని విషయాలు చెప్పివెళ్లింది. వడ్డన పని కళ్యానికి వప్పజెప్పవద్దనికూడ వంటమనిషికి చెప్పడం మరచిపోలేదు మాలతి.

జయకృష్ణ ఆలశ్యంగా ఆఫీసుకు వెళ్లడం, త్వరగ యింటికి రావడం ప్రారంభించాడు. అప్పుడప్పుడు ఆఫీసుకు వెళ్లడంగూడ మానడం ప్రారంభించాడు. ఈ విషయం కళ్యాణి జాగ్రత్తగ చూస్తూఉంది. కాని వంటమనిషికి యిదేమి పట్టలేదు. మొదటి రోజునే వడ్డనకు వెళ్లింది. చివాట్లుతగిలాయి. కళ్యాణి దగ్గరికి వచ్చి "నీవు వడ్డించు తల్లీ, నావల్లకాదు." అని బ్రతిమలాడింది. కల్యాణికి గత్యంతరం లేక పోయింది. జయకృష్ణకు కావలసిందిగూడ అదే. భోజనం చేస్తూ అన్నాడు "కళ్యాణీ! నీ భవిష్యత్తునుగురించి ఏమైన నిశ్చయించావా?"

సంకోచంతో కల్యాణి యిలా అన్నది- "ఏమినిశ్చయించేది! ప్రపంచవిషయాలు నాకేమి తెలుసు! మొదట మా పినతల్లి దగ్గర ఉంటూ ఉండేదాన్ని. ఆమెకూడ వితంతువు. ఒకరోజున నాకు వివాహం అని తెలిసింది. భర్త ఎవరో నాకు తెలియదు. తరువాత మీరంతవచ్చారు. ఇకజరిగిందంతా మీకు తెలుసు. అప్పటినుండి మీ దగ్గరే ఉంటూవున్నాను. మా పినతల్లి కూడ చనిపోయిందని తెలిసింది.

ప్రపంచంలో మీరు దప్ప యింకెవరు వున్నారు చెప్పండి! యిక నేనేమి నిశ్చయించేది?"

"నీకు వివాహం జరిగిన మాటవాస్తవమే. కాని అది లెక్కించతగింది కాదు. భర్త మొహంకూడ నీవు సరిగ చూడలేదు. మళ్లీ వివాహం చేసుకోవడం యిష్టమేనా?"

"మళ్లీ వివాహమా! వివాహవు సుఖం నానుదుట వ్రాసిఉంటే రైలు ప్రమాదంలో నా భర్త చనిపోయేవారేకాదు" అంటూ కంట తడి బెట్టింది కళ్యాణి.

"అలా అనుకోవడం పొరపాటు కళ్యాణీ! విధిలిఖితాన్ని ఎవరం తప్పుకోగలం! అందులో నీ దోషమేముంది; యింత అందం యిచ్చిన విధాత సుఖం గూడ కలుగజేస్తాడనే నా నమ్మకం. సరే మార్గం నిశ్చయించు. ఇష్టమైతే ఏదైనా పాఠశాలకు పంపే ఏర్పాటు చేస్తాను."

ఆమెకు నవ్వువచ్చింది. నవ్వుతూ అన్నది, "వయస్సు మళ్లుతూ ఉన్నది. చిన్నపిల్లలతో బాటు ఎలా చదివేది? చదువువస్తుందానాకు! బొత్తిగ మూర్ఖురాలను"

నవ్వుతూ ఉండగా ఆమెను ఎప్పుడూ చూడలేదు జయకృష్ణ. ఆమె నవ్వుచూచి చలించిపోయాడు, కాని సంబాళించుకొని అన్నాడు–

"ప్రయత్నించితే అంతా వస్తుంది కళ్యాణీ! అయినా బాగ ఆలోచించి సాయంత్రం నీ ఉద్దేశ్యం చెప్పు"

భోజనాలయిన తరువాత రాత్రి ప్రొద్దుపోయేదాక ఇద్దరూ మాట్లాడుతూ ఉన్నారు. వంట మనిషి గురకలు పెట్టి నిద్రబోయింది.

కళ్యాణి అన్నది. "భర్తను ప్రేమించలేక పోయాను. మా యిద్దరి సంయోగము వియోగము ఒక్కసారే జరిగాయి. దయతో నన్ను స్వీకరించారు. వారంటే అమితమైన శ్రద్ధకలిగింది. ఆశ్రద్ధ యిప్పుడూ ఉంది. కాని ప్రేమ అంటే ఏమిటో మిమ్మల్ని మెట్లమీద చూచినరోజున తెలిసింది. మీరంటే శ్రద్ధ భక్తి కలిగాయి. అంతేగాక ప్రేమకూడ కలిగింది. కాని మిమ్మల్ని మళ్లీ వివాహం చేసుకోవడం మాత్రం అసంభవం."

"కళ్యాణీ! ఇందులో అసంభవం ఏముంది!" అంటూ ఆమె చేతుల్ని పట్టుకున్నాడు జయకృష్ణ. అతని కంఠం కంపిస్తూ ఉంది.

చేయివదిలించుకొని సందేహంతో జయకృష్ణనివైపు చూచింది ఆమె. జయకృష్ణ తన పొరపాటు గ్రహించాడు. రెండు కండ్లు మూసుకొని అన్నాడు "కల్యాణీ పొరబడ్డాను. యిక యిలాంటి పొరపాటు జరుగదు. నేనంటే భయపడకు. నీకు యిష్టం లేకుండ నిన్ను ఎన్నడు బాధించను. కాని ఒక్క విషయం. మళ్లీ వివాహం చేసు

కదా "అవును శారదా! మా నాన్నకి అందచందాల మాట తెలియదు తెలిస్తే నిన్ను కోడలుగా తెచ్చుకోనేవాడా ?"

దీంతో అనూరాధకి తానో సమస్యలో ఇరుకొన్నట్లయింది. అక్కడినుండీ వెళ్లిపోయింది. కానీ అమ్మదగ్గర ఎదురింటి రామమ్మగారు కూర్చునివున్నారు. ఆవిడ అనూరాధని చూడగానే "అల్లుడు పండక్కి రాలేదేమివదినా"! ఆఁ అయినా అమ్మాయికి తగ్గవాడు కాడమ్మా విధి లిఖితం మనమేంచేద్దాం" అన్నది. అనూరాధకి ఏడ్పువచ్చింది. అక్కడినుండీ వంటగదిలోకి వెళ్లింది. రెండోవదినా వంట చేస్తోంది. ఆడబిడ్డ కంటినీరుచూచి ఆవిడ ఏమనుకొందో మూడోవదినతో అంటూ ఉండడం విన్నది స్పుటంగా అనురాధ.

"మొగుడు రాలేదని బెంగో ఏమో అందమైన మొగుడు రాకపోతే ఏం?" అనూరాధ వినలేకపోయింది.

చిన్నన్న వీధిగదిలో కూర్చునివున్నాడు అనూరాధ అక్కడికెళ్లి కూచుంది "పండుగపూట అదేంకన్నీళ్లు రాలుస్తున్నావేం?" అని అడిగాడు చిన్నన్న.

అనురాధ చప్పున కన్నీరు తుడుచుకొని మాటమార్చింది. "అదిసరే అన్నా! లక్ష్మిని నీవు చేసుకుంటావని చెప్పావా?" అని కొంచెం ఆశ్చర్యంతో అన్నది.

చిన్నన్న నవ్వాడు "అవును, ఏం? లక్ష్మిఅందంగా లేదనా; నీ ఆశ్చర్యం?"

అనూరాధ సిగ్గుపడ్డది "కాదన్నా: కురూపులలో మొదటి స్థానం లక్ష్మిది అని నా అభిప్రాయం. అలాంటి అమ్మాయిని నీవు ఒప్పుకొన్నావంటే నా కాశ్చర్యం వేసింది నేనునమ్మలేక పోయాను"

"అందంలో లక్ష్మి జాబితాకాదనుకో ఆ పిల్లగుణం ఎటువంటిదో తెలుసా; గుణం లేని అందం మొండిగోడకు సున్నంకొట్టినట్లవుతుంది. ఆమాటకొస్తే నీవు మూర్తిని పెళ్లాడలేదా; చక్కగానే కాపురంనీవు సాగించుకోలేదా ఏమిటి! నీవు మూర్తితో ఏంచేస్తున్నావు? అందము; గుణము?" చిన్నన్న అడిగిన ప్రశ్నకు అనురాధ ఏం జవాబు చెపుతుంది!

చిన్నన్న తిరుగా అన్నాడు "చూడు రాధా క్షణభంగురమైన అందాలతో నిమిత్తం పెట్టుకొని ఏంబావుకొంటారు? అందమైన దాన్నే ఏరికోరి పెళ్లాడుతాను అనుకో; ఆ పిల్ల మధ్యలో స్ఫోటకమొచ్చి ఏదోవిధంగా కురూపి అవుతుంది. అప్పుడేం చెయ్యాలి? ఇది అందంగా లేదు అని కట్టుకొన్నదాన్ని విడిచివేయనా? లేదామరో అందకత్తెతో పెళ్లి సాగీయనా? అందంగావుంది మొన్ననేచూచిన డాక్టరు గారమ్మాయి. కానీ గుణం తిన్నగాలేని

(50 పుట చూడుడు)

# సంక్రాంతి ఉపదేశం

మిస్. నిరుపమగురుపల్

మహాలక్ష్మమ్మ సంసారం పాల సంద్రము వంటిది. కొడుకులు, కోడళ్ళు, కూతుళ్ళు, అల్లుళ్ళు, మనుమలు, మనుమరాళ్లు అందరూ ఎంతో సరదాగా గలగలమనిపిస్తుండేవారు ప్రతిపండక్కీ! మహాలక్ష్మమ్మగారి ఆఖరి కూతురు అనూరాధ. అనూరాధ నాన్నగారు బ్రతికున్నపుడే కూతుళ్లకు కొడుకులకు పెళ్లిళ్లు చేసివేసారు కాబట్టి మహాలక్ష్మమ్మ ఆనందంతో కాలం వెళ్లబుచ్చుతోంది. కానీ అనూరాధని కూడా అందమైన వాడికే ఇచ్చివుంటే ఆమె కేచింత లేకుండా వుండేది, కానీ పిల్లవాని గుణం ప్రధానమని అందంతో అవసరంలేని రామయ్యగారు చక్కని చుక్కవంటి అనూరాధని 'మూర్తి' కిచ్చి పెళ్లిచేసారు. ఆ పెళ్లి మహాలక్ష్మమ్మకు కూడా ఇష్టం లేదు. కానీ భర్తకెదురాడే గుణం ఆమెలోలేదు. "మూర్తిగుణం చాలామంచిదని, నీ అల్లుళ్ళందరిలో మూర్తి చాలామంచివాడు, నీ కొడుకులకన్నా ఎక్కువగా మూర్తిని చూడాలినీవు" అని చెప్పాడు రామయ్య. కానీ అసంతృప్తిగా నవ్వింది మహాలక్ష్మమ్మ.

తల్లిమాలాన భర్తంటే ఒకవిధమైన అసహ్యాభావం ఏర్పడింది అనూరాధకి. మూర్తి మాట్లాడించినా మాట్లాడక ఒక విధంగా అతనికి మనసీక పడక టింట్లో రెండుమంచాలు వేయను అవకాశ మిచ్చింది. మూర్తి మొదట్లో "చిన్నతనం" అనుకొని ఆఖర్న "చక్కటి అనూరాధకి తన కురూపితనం తనమీద అయిష్టమని, అంచేత ఇష్టంలేని పెండ్లి, మనసులేని కాపురం" అనుకొన్నాడు..

అదిమొదలు అనూరాధతో మాటలు తగ్గించివేసాడు. భార్య భర్తలు ఎడమొహం పెడముఖంతో వుండడంచూచి అనూరాధ అత్తగారు, మామగారుకూడా ఆ విషయంగా ఏమి చెప్పలేకపోయారు. కోడలికి ఏవిధానా చెప్పలేక అనూ అత్తగారు గుటకలు మింగుతూనే కూర్చుంది ఆరునెల్లూ;

సంక్రాంతి పండగకు మహాలక్ష్మమ్మ ఇల్లు కలకలలాడింది. తొలిసంక్రాంతికి "మూర్తి"ని రమ్మని రాసారు. కానీ మూర్తి తనతమ్మునితో అనూరాధని మాత్రం పంపాడు. అత్తారింట్లో తనకు 'విలువ' లేదని.

అనురాధ పెద్దన్న మాత్రం "నీ మొగుడు రాలేదేమ్మా?" అని అడిగాడు.

పెద్దవదిన అందుకొని "ఆఁ ఎందుకు ఇంతమందిలో దిష్టి బొమ్మలావుండాలా. నీకునాన్నగారికి అందచందమే తెలియదు" అనిఅన్నది.

పెద్దన్నవూరుకొన్నారా - అన్నాడు

కుంటే దోషం ఏముంది! నన్ను ప్రేమించుతూ ఉన్నావుగదా? పరిస్థితుల్లో నన్నే వివాహం చేసుకోరాదూ!''

''మీరు వివాహితులు అందువల్లనే అసంభవం'' దృఢ నిశ్చయంతో అన్నది ఆమె.

''హిందూశాస్త్ర ప్రకారం పురుషుడు చాలా వివాహాలు చేసుకోవచ్చుగదా! అదృష్టం నాకే ఎందుకు కలుగకూడదు!''

''ఛీ, ఛీ, ఇంకొకరిని వివాహం చేసుకొంటాననా మీ ఉద్దేశ్యం! - అసంభవం. మొదట మిమ్మల్ని ప్రేమించాను. ఆ ప్రేమతో నా జీవితం సమాప్తం కావలసిందే. హిందూస్త్రీకి ప్రేమించడం తెలుసు, కాని ప్రేమకు బదులు కోరడం హిందూస్త్రీకి తెలియదు. నేను ప్రేమించాను. ప్రేమించుతూ ఉంటాను. ప్రేమమూర్తిని పొందక పోవడం వేరువిషయం. వారి వారి అదృష్టం'' అంటూ నిట్టూర్పు విడిచింది. కళ్యాణి.

''కళ్యాణీ! నీ విషయం మాత్రమే ఆలోచిస్తూ ఉన్నావు, నన్ను గురించి యోచించడమే లేదు. నీవు లేనిది క్షణం గడవదు. కాని ......సరే...నిశ్చింతగా ఉండు. భయంలేదు. నీకు యిష్టంలేనిదే నిన్ను బాధించను. నీ సోదరుని సమీపంలో ఉన్నంత సురక్షితంగా ఉండు. నేను అధముణ్ణికాను. నిన్ను ప్రేమిస్తూ ఉన్నాను. నిన్ను వివాహంచేసుకొందామని అభిలషిస్తూ ఉన్నాను. కాని సత్యమార్గం వదలను. చెడుమార్గాన నడవను.''

''నన్ను గురించి, మిమ్మల్ని గురించి నేను యోచించడంలేదు. మాలతి అక్క సౌభాగ్యాన్ని భగ్నం చేయడం నాకు యిష్టంలేదు. దురదృష్ట సమయంలో — కష్టపుదినాల్లో ఆమె నాకు ఆశ్రయం యిచ్చింది. చేతనైతే ఆమెకు మేలు చేయడం నా కర్తవ్యం. అపకారం చేయడం అధర్మం. ఆమె క్షేమం కోసం, నా ఆత్మార్పణకైనా సిద్ధమే. కాని ఆమె జీవితానికి మాత్రం కంటకంగా మారను.''

''అయితే నా జీవితం కంటకమయం చేస్తావా!'' అంటూ నిట్టూర్పు విడిచాడు జయకృష్ణ.

''ఇదంతా మానసికదౌర్బల్యం. కొద్ది రోజుల్లో యీ దౌర్బల్యం తనంతట తానే సమసిపోతుంది. నేను స్త్రీని. అయినా అన్ని బాధలు సహించేందుకు సిద్ధంగా ఉన్నాను. మీరో.. పురుషులు. కష్టాల్ని ఎదుర్కొనేందుకే మీ జీవితం. మాలతి అక్కకు జాబువ్రాశాను. ఆమె బయలుదేరి ఉండవచ్చు. ఆమెరాగానే సెలవుతీసుకుంటాను. సెలవు తీసుకొనే ముందు మీపాదధూళిని మాత్రం భిక్షగ కోరుతూ ఉన్నాను. యిక నాకేమి అవుసరంలేదు.''

జయకృష్ణ పాదాల క్రిందనుండి భూమి తొలగి పోయినట్లయింది. కంగారు పడుతూ అన్నాడు. ''మాలతికి జాబు ఎప్పుడు

వ్రాశావు! వ్రాసేముందు నాకు చెప్ప కూడదా!''

నేనేమీ వ్రాయలేదు. అమ్మాయి లేకపోతే ఏమి తోచడం లేదు. త్వరగ రమ్మని మాత్రం వ్రాశాను. మాలతిలేకుండ నేను ఒంటరిగ ఉండటం క్షేమంకాదు. మనం ఒకరినొకరు ప్రేమిస్తూ ఉన్నాం. ఏక్షణంలో ఏమి జరుగుతుందో తెలియదు. మనకు కళంకం ఆపాదించే ఘట్టాలు జరగడం నాకు ఎంతమాత్రం యిష్టంకాదు.''

''కళ్యాణీ! నీవు మంచిపని చేశావు చాలప్రొద్దుబోయింది. వెళ్లునిద్రించుము.''

లేచివెళుతూ ఆమె వంగి జయకృష్ణుని పాదాలకు నమస్కరించింది. జయకృష్ణుని వ్యాకులత్వానికి అంతులేదు. జయకృష్ణుని కండనుండి కన్నీటిధారలు ప్రవహించ సాగాయి. రెండు మూడు కన్నీటిచుక్కలు భూమి మీద రాలియింకిపోయాయి. ఆమె బరువెక్కిన హృదయంతో పైకి వెళ్లి తలుపులుమూసింది. జయకృష్ణకు మాత్రం నిద్రరాలేదు.

♦ ♦ ♦

మర్నాడు రెండుగంటల బండికి మాలతి వచ్చింది. ఆఫీసునుండి వచ్చేసరికి ఉపమ ఆడుకొంటూ కనబడింది. రాత్రంతా నిద్రలేదు అందువలన జయకృష్ణ మొఖం వాడిపోయి ఉంది. భర్తనుచూచి మాలతికి పైప్రాణం పైనే బోయింది. ''ఇలా అయిపోయారేం! ఆరోగ్యం సరిగాలేదా?'' జయకృష్ణను కష్టంగలిగింది. మాలతి మాటలు వ్యంగ్యంగ తోచాయి. ''ఏమి లేదు తల నొప్పిగా ఉంది'' అని జవాబు చెప్పాడు సంక్షేపంగ. తలనొప్పి మాటవిని మాలతికి అమితభయం వేసింది.

''కళ్యాణి ఇంకా యింట్లోనే ఉన్నది గదూ! పంపించి వేయమని చాలా సార్లు చెప్పాను మీరు వింటేగదూ! పాపిష్టి అభాగ్యురాలు ఎంతత్వరగ వదిలితే అంత మంచిది. మీకు తలనొప్పివస్తే నాకు భయం'' మాలతి శరీరం వణుకుతూ ఉంది.

''కళ్యాణిని మహిళా విద్యాలయంకు పంపేందుకు నిశ్చయించాను – పిలు, నెబుదాము''

యిదివిని మాలతికి ధైర్యం కలిగింది. ''ఆమె ఇంటినుండి వెళ్లితే అదే పదివేలు– ఎక్కడికి పోయినాసరే'' అంటూ ఉపమను పిలిచింది ''అమ్మాయ్ వెళ్లు అత్తయ్యను పిలుచుకురా'' అని చెప్పింది.

''అమ్మా! అత్తయ్యలేదు'' అని జవాబు చెప్పింది ఉపమ.

కంగారు పడిందిమాలతి ఇల్లంతా వెతకి చూచింది. కళ్యాణి ఎక్కడా లేదు జయకృష్ణ పిచ్చివాడిలా పైకి వెళ్లి చూచాడు. ఆమె పడుకొనే మంచంమీద ఆమె ఆభరణాల పెట్టె పెట్టబడి ఉంది. దానిక్రింద ఒక చీటీ కనబడింది. అందులో యీ విధంగా వ్రాసిఉంది. ''వెళుతూ ఉన్నాను. మీ యింట్లో ఉండి కలిగించిన కష్టాలకు, చేసిన పొరపాటుకు క్షమించ ప్రార్థన. నన్ను వెతకడంకోసం శ్రమపడ వద్దు. ఈ ఆభరణాలు ఉపమకు...

అభాగిని కళ్యాణి

# ఆంధ్ర జానపద గేయ వాఙ్మయ చరిత్ర

## జంగం కథ

శ్రీ తేకుమళ్ల కామేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

### జంగం కథ పేరు

జంగాలు వీరశైవమత విజృంభణతో (క్రీ. శ. 1150) ప్రారంభించేరు. ఈ కథలను జంగాలు పాడుతూండడంబట్టి జంగంకథలనే పేరు ఏర్పడింది. అటువంటి సందర్భంలో క్రీస్తు పూర్వపు రచన అని చెప్పతగ్గ కాంభోజరాజుకథను జంగంకథ అని పిలవడంలో సబబేమిటి? అది పుట్టినప్పుడు ఆ రకంకథలకేమి పేరుండేదో మనకి తెలియదు. కాని ఆ కథనే ఆటుతర్వాతివారైన జంగాలుపాడి వినిపిస్తూన్నందువల్ల దానికికూడ తక్కినవాటికివచ్చినట్లే జంగంకథ అనుపేరు వచ్చింది. అనంతంగా ఉన్న జానపదగేయ వాఙ్మయంలో ఇదొక ప్రధానశాఖ అయింది.

### జానపదగేయ కవిత్వం

జానపద[illegible] వాఙ్మయంలో జానపద గేయ[illegible] జానపదగేయం అను శీర్షిక క్రింద చెప్ప[illegible] వివిధ [illegible]రూపాలను (Types of p..ms) పూ[illegible] లి[illegible]జేసేను అవేవంటే జంగంకథలు, పూర్వ[illegible], అర్వాచీనపదాలు, వాగేయాలు ఇత్యాదులు. జానపదగేయం అను మాటకంటే జానపదకవిత్వం అనుమాట విశాలమైనదని నా అభిప్రాయం జానపద కవిత్వం అనుమాటకింద జానపదగేయాలేగాకుండ, మరికొన్ని కావ్యరూపాలు— అనగా, జంగంచరిత్రకథలు, యక్షగానాలు, కురవంజులు, నాటకాలు, హరికథలు, కీర్తనకావ్యాలు కూడ వస్తాయి. పూర్వకాలంలో రచించబడ్డ ఉదాహరణగ్రంథాలుకూడ వీటికిందరావచ్చు. జానపదగేయాలకు యక్షగానాదులకుఉండే ఒక ముఖ్యభేదమేమంటే ఒక గేయంలో (Poem) చిన్నదైనాసరే పెద్దదైనాసరే ఒకే ప్రధాన ఛందోలక్షణం (Metre) ఉంటుంది. దీనిలో కీర్తనాదులు మధ్య మధ్య సకృత్తుగా ఉంటే ఉంటాయి. యక్షగానాదుల పద్ధతేమంటే, వీటిలో అనేక ఛందస్సులకు సమాన ప్రాముఖ్యత ఉంటుంది.

### జంగం[illegible]కథ

జంగం కథలను [illegible]యవలసిన సందర్భంలో జంగంచరిత్ర కథలను గురించికూడ చెప్పక తప్పదు.

పాటగాళ్లు సాధారణంగా జంగంకథలని చెప్పేవాటిలో రెండురకాలున్నాయి. కాని ఈ రెండు రకాలకీ వారు పెట్టిన దొకేపేరు — అనగా జంగం కథలు. రెండు భిన్నస్వరూపాలకి ఒకే పేరయితే గజిబిజికి కారణమవుతుంది. ఈ రెండు రకాలు ఏవంటే — 1. కవులు స్వతంత్రంగా కల్పనచేస్తూ దీర్ఘగేయాలుగా రచించిన కాంభోజరాజుకథ, చిన్నమ్మకథ ఇత్యాదులు. 2. స్వతంత్రకథలుగాక వెనకటి కథలనుంచి తీసుకోనబడి అనేక ఛందస్సులను ఉపయోగిస్తూ రచించిన రచనలు. ఈ రెండింటిలో మొదటి రకానికి మాత్రమే జంగంకథ అను పేరు ఉంది, రెండో రకానికి జంగంచరిత్రకథ అను పేరును పెట్టేను. దానికి కారణమేమంటే గేయకథలు ఈ రెండోరకం కథలకు సాధారణంగా చరిత్రలు అంటూ పేరుపెట్టేరు. కాని ఇవి కేవలం చరిత్రలు కావు. కాబట్టి ఆ పదానికి చివరకథఅను మాటనుకూడచేర్చి జంగంచరిత్రకథలు అనుపేరును ఏర్పరిచేను.

వాటికికవులు ఇదివరకే చరిత్రఅను పదాన్ని ఉంచేరు అను విషయాన్ని ఇక్కడ విశదపరుస్తున్నాను. ఈ కావ్యాలపేర్లలోని చరిత్రఅనుపదం

కూడ ఉంది - సిరియాళమహారాజుచరిత్ర, దేవయాని చరిత్ర ఇత్యాదులు. కవి ఒక్కొక్కప్పుడు పేరు లోనె చరిత్ర అను పదాన్ని చేర్చకపోయినా, గ్రంథపీఠికలో చరిత్రఅనే చెప్పుతూవచ్చేడు. భల్లాణరాయకథ అనుపేరులో 'చరిత్ర' అనుమాట లేదు. కాని దాని పీఠికలో—

సరళముగాను ఈ చరితము వెలయును సిరులు గుల్కుముందు (పుట 54) అన్నాడుకవి. వామన విజయం అను కావ్యంలో కవి 'సచ్చరితము జంగము కథారూపంబుగానుడువ సమకట్టగా' అతని పోషకుడు ఈ కింది విస్తరుగా చెప్పేడు—

జ్ఞానమిత్ర! వామనచరిత్రము
కడుమోదంబునను
పూనికతో జంగమకథారూపుగ
మానక సల్పుమన (పుట 3).

కాబట్టి ఈ కవులు తమ కథలకు చరిత్రలను పేరు కూడ ఉద్దేశించేరని చెప్పవచ్చు. అందుచేతే ఈ రకం కథలకు 'జంగం చరిత్రకథలు' అను పేరును ఏర్పరిచేను. ఈ రకం కథలుకూడ జంగాలు పాడడం కోసమే రచించబడ్డాయి. ఆ విషయాన్ని కవులే వెల్లడిచేశారు.

1. భల్లాణరాయకథలో కవి ఈలాగు అన్నాడు.

'జంగమ దేవర్లంగుగాను ను
ప్పొంగుచు చదువంగ'

తాను రచించేడు!

2. విరాటపర్వాన్ని రచించినకవి—

'శివమతస్థులగు జంగంబులకు
జీవనధనమనగా'

తాను రచించేడు, అంటే - జంగాలు పాడుకొని జీవనోపాధి గడించుకోడానికి తాను వ్రాసేడు. ఈ గేయాలను పాడేవారు జంగాలు కాబట్టి ఈ కథలకుకూడ జంగం కథలనే సావా పేరు ఏర్పడింది.

కాని మొదటిరకపు జంగం కథలకు, ఈ వేరురకపు జంగం కథలకు గజిబిజిలేకుండ ఉండాలంటే, వీటికి జంగంచరిత్ర కథలను పేరుపెట్టుకోక తప్పదు.

జంగం కథలకి జంగంచరిత్ర కథలకు ఉండే ఇతర భేదాలను ఇక్కడ విశదపరుస్తాను.

1. జంగంకథలు అనగా కాంభోజరాజుకథ, పెద్ద బొబ్బిలిరాజుకథ, కామమ్మకథ ఇత్యాదులు పూర్తిగా ఉపజ్ఞా (Original) గ్రంథాలు. వాటి ఇతివృత్తాలు సమకాలిక చరిత్రనుంచి, లోక జీవితంనుంచి తీసుకొని గేయాలుగా రచించబడ్డాయి. కాని జంగంచరిత్రకథలు అట్టివికావు. అవి సాధారణంగా ఏ పురాణంనుంచో ఎత్తబడి రచించబడ్డాయి. ఇతివృత్తం విషయంలో ఇవీ అర్వాచీనపదాలు ఒక్కటే (ఈ పదాలు చాలవరకు 18, 19 శతాబ్దాలలో రచించబడ్డాయి.) అర్వాచీన పదాలన్నిటికీ హరి హరి నారాయణ పదలక్షణమే ఆదర్శం. 2. జంగం కథలు ఫలానా లక్షణంలో ఉండాలనే నియమం లేదు. అందుచేత అనేక లక్షణాలలో ఉన్నాయి. కవి తనకు తోచిన లక్షణాన్ని సృష్టించుకొన్నాడు. జంగంచరిత్ర కథలకు ప్రధాన లక్షణం రగడ. ఇది ఈ రకం కథలన్నిటిలోను కనబడుతూంది. 3 జంగం కథలు ఆదినుంచి అంతందాక ఒకే లక్షణంలో ఉంటాయి. మధ్య ఎప్పుడేనా కీర్తనాదులుంటాయి. కాని జంగంచరిత్రకథల సంగతేవేరు. రగడలో మధ్యమధ్య కీర్తనలు, పద్యాలు, వచనం ఇత్యాదులుంటాయి. ఇవి ఈ రెండు గేయమూర్తులకుఉండే ముఖ్యభేదాలు, చిల్లర భేదాలుకూడ ఉన్నాయి.

సాధారణంగా గ్రాంథిక ప్రబంధాలలో ఒక పోషకుని కోరికమీద ఒక కవి ఒక ప్రబంధాన్ని నిర్మిస్తాడు. ఈ ఆచారమే జంగంచరిత్ర కథలకు కూడఉంది. జంగంచరిత్ర కథలలోని భాష అభ్యుదయ గ్రాంధికం. జంగంకథలలో కాంభోజరాజుకథ వంటివి చాల పాతవి. కాని జంగంచరిత్ర కథలన్నీ ఇటీవలి రచనలలాగు కనబడుతున్నాయి. జంగం కథాకవులు తమ వంశాన్ని వివరంగా తెలుపుకొనే ఆచారాన్ని పెట్టుకోలేదు. కొందరు కవులపేర్లే తెలియడంలేదు. ఈ విషయంలో జంగంచరిత్ర కథా

కవులు వేరుగా ఉన్నారు. వారు తమ వంశాన్ని తెలుపుకొన్నారు. రచనాకాలాన్ని తెలుపుకోవాలన్న ఆచారం ఈ రెండు రకాల రచనలలోనుకూడ లేదు.

## జంగంకథల ప్రత్యేకత

తిక్కనాదికవులు తెలుగులో చాల ప్రబంధలను రచించేరు. వీటిలో కొన్ని సంస్కృత కావ్యాలకు స్వేచ్ఛానువాదాలు. మరికొన్ని సంస్కృతంలోని ఏ చిన్నకథనో తీసుకొని వన్నెచిన్నెలు చేకూర్చబడ్డాయి. కాబట్టి ఇవి సంపూర్ణంగా ఉపజ్ఞా గ్రంథాలని చెప్పలేము. ఉపజ్ఞా గ్రంథం (Original book) యొక్క ఒక ముఖ్యగుణమేమిటంటే – దీని ఇతివృత్తం ఇతర గ్రంథాలనుంచిగాక లోకంనుంచే సాధారణంగా తీసుకోబడుతుంది. ఈ ఇతివృత్తం సాధారణంగా సమకాల ప్రపంచంనుంచే గ్రహించబడుతుంది. ఆంగ్ల భాషలో ఉన్న నవలలు, చిన్నకథలు ఈ పద్ధతికి చెందినవే! ఇంగ్లీషులో చారిత్రక కావ్యాలు లేకపోలేదు. చారిత్రక నవలలనువ్రాసి ప్రసిద్ధిచెందినతను సర్ వాల్టరుస్కాట్. అయినా చారిత్రక నవలాసృష్టి సరియైనది కాదని విమర్శకులాక్షేపించారు. ఎందుచేతంటే, దానికథ సమకాలికమవదు. దానిలోని విశేషాలన్నీ ఊహాలోకంలోనివే! ఎందుచేతంటే జరిగిపోయిన కాలంలోని విశేషాలు మనకి పూర్తిగా తెలియవు. ఆ నాటి భాష, సాంఘికాచారాలు, రాజకీయనియమాలు, దుస్తులు మొదలైనవన్నీ సమగ్రంగా తెలిసే అవకాశాలు లేనేలేవు. కాబట్టి కవే లేనిపోనివి సృష్టించి ఇవన్నీ ఆనాడున్నాయి అనే అజ్ఞానాన్ని కలిగించే అవకాశముంది. ఇటువంటి కారణాలవల్ల చారిత్రక లేక పూర్వకాలపు సంఘాన్ని చిత్రించేకథలు ప్రారంభంలోనె అపరిపూర్ణంగా ఉండక తప్పవు. కాబట్టి కల్పన రెండు రకాలని తెలుస్తూంది. ఒకటి, సమకాలికాధారాలను అనుసరించిచేసేకల్పన యథార్థకల్పన అనవచ్చు. అట్లుగాక ఎన్నడో జరిగినవాటినిమార్చు, చేర్చిచేసే ఊహాకల్పన మరొకరకం. ఈ రెండురకాల కల్పనలలో ఊహాకల్పన రెండోపక్షం. ఈ పట్టున తెలుగు గ్రాంథిక ప్రబంధాలను గురించి కొంత చర్చించవచ్చు. పురాణకథలో అభూతకల్పన ఎంతవరకుఉందో? వాటి కాలమేదో? కాలంనాటి యథార్థజీవితమెవరికి తెలుసు? వాటిని తెలుసుకోడానికి ఆధారాలెక్కడ? ఇటువంటి సంశయాలన్నీ బోలెడన్ని బయలుదేరవచ్చు. కథ ఉపజ్ఞంగా ఉండాలనే నియమం లేకపోయినందువల్ల తెలుగు కవులు ఇతివృత్తాన్ని సమకాలిక జీవితంలోంచి తీసుకోవాలనే నియమంలేకపోయింది. అంతేకాదు, 'కేవల కల్పనా కథలు (Original stories) కృత్రిమ రత్నాలు' అన్నాడు రామరాజభూషణుడు. ఉపజ్ఞాకథయొక్క ఘనతను ఎరగకపోడంచేత వచ్చినమాట అది. కాబట్టి ఇట్టి కావ్యాలకు కథలోని చక్కదనంకంటె, భావ, అలంకారాలు ముఖ్యమయేయి. అంతేకాదు నానాటికీ కథాప్రధానాలకంటె భాషాప్రధానాలవుతాయి. చిత్రకవితలు, రెండర్థాల కావ్యాలు, మూడర్థాల కావ్యాలు నాలుగర్థాల కావ్యాలు, ఆశుకవిత్వమున్నూ, కవిత్వపు కళ అని చెప్పుకోవలసిన దుర్గతి పట్టింది. దీనికంతా మూలం మనం సంస్కృత గ్రంథాలను అనుసరించడం అని చెప్పినంతమాత్రాన మనం దోషరహితులంగాము.

సాహిత్యంయొక్క ప్రభావం మానవజీవితంమీద ఉండక తప్పదు. ఈరకం గ్రంథాలు ఆనందమియ్యవచ్చుకాని లోకజ్ఞానాభివృద్ధికరాలు అనడానికి వీలులేదు. "ఆంధ్రవాఙ్మయమనుకరణ వాఙ్మయము, నన్నయ యేలగ్నమున సంస్కృత మహాభారతము నాంధ్రీకరింప దొడగెనో కాని దాని బలమున నాంధ్ర వాఙ్మయమంతయు ననువాదములమయమైపోయినది. సంస్కృత వాఙ్మయము నాంధ్రులవలె భారతీయులలో మరెవ్వరును మూటగొనియుండలేదు. సంస్కృత పురాణేతిహాస మహాకావ్య నాటక ధర్మశాస్త్రాది సకలవిధ గ్రంథములకును తెనుగున డూప్లికేటులను తయారుచేయుటయే తమ జీవిత పరమావధియని యాంధ్రకవులు తలచినట్లున్నది. స్వతంత్ర మిశ్ర కావ్యములు రచియింతుమని ప్రగల్భములు పల్కిన ప్రబంధకవులుగూడ సంస్కృతకవుల గ్రంథముల నుండి లూటీచేయుట మానలేకపోయిరి. ... ...

ఈ సంస్కృత వాఙ్మయదాస్యము ఇరువదవశతాబ్దము వఱకును తొలగలేదు.*"

మన ప్రబంధకావ్యరచనలోని దోష మార్గానికి కారణంలేకపోలేదు. మనకవిత్వం రాజాస్థానాలలో పెరిగింది. రాజులు తమకితోచిన కావ్యాలనే కవులను రచించమనేవారు. కాబట్టి కవికి మంచిది అని తోచినా రాజుకి మంచిది అని తోచకపోతే ఆ ఇతివృత్తంవల్ల లాభంలేదు. కవులు తమ ప్రతిభను పూర్తిగా ప్రకటించుకొనే అవకాశంలేకపోయింది. అట్టి కావ్యాలనే మెచ్చుకొంటూన్న ప్రజలకు స్వతంత్ర రచనలోని మెప్పును గ్రహించలేకపోయేరని చెప్పక తప్పదు. కాబట్టి కవులుచేసిన అనువాదాలకే ప్రసిద్ధివచ్చింది కాని వారి స్వంతరచనలకు ప్రసిద్ధి వచ్చినట్లుగా కనపడదు. పింగళిసూరన్న రచించిన కళాపూర్ణోదయానికి లోకంలో రెండుమూడు తాళపత్రప్రతులు మిగలడమే కష్టమైపోయింది. అమరకంఠతా పెట్టిన ప్రతివాడు గ్రంథరచనకు పూనుకొని మహాకవుల గ్రంథాలను జాగ్రత్తపెట్టలేకపోవడంచేత వారిపేళ్ళేగాని కొన్ని కావ్యాలు దొరకడంలేదు.

అయితే మ[illegible]ని ఘనతేమిటి? మనదంతా ఆద[illegible]. ప్రజలకు వాఙ్మయం ద్వారా మనమం[illegible]ని ఘనతను, జీవితంలో ఉత్తమ మార్గాలను బోధించే సాహిత్యమదంతా లోకశాంతిని కాంక్షించేది. వాఙ్మయమిట్టిది కాబట్టే ప్రజలు శాంతిప్రియులయేరు. పాశ్చాత్యులు మన సంఘంలోని శాంతిప్రియత్వాన్నిచూసి ఆశ్చర్యపోతున్నారని చెప్పవచ్చు. మానవ సంఘానికి అవసరమైన శాంతిని మన ఆదర్శపూరిత సాహిత్యం కలిగిస్తుంది. ఇదే మన వాఙ్మయంలోని ఘనత.

రాజాస్థానాలలో పుట్టిన సాహిత్యంలోని దోషాన్ని ప్రజాసాహిత్యం కొంతవరకూ పరిహారం చేసిందని చెప్పవచ్చు. ప్రజాసాహిత్యం అదినుంచీ కొత్త దారులను తొక్కింది. దీనికి జంగంకథలే నిదర్శనం. వీటికి సమకాలిక పురుషులు, ఘటనలు ఆధారం. వీటిద్వారా మనం కొంతవరకు ఆనాటి సజీవ ప్రపంచాన్ని తెలుసుకోవచ్చు. ఆనాటి సంఘ నియమాలు, సంప్రదాయాలు, ఆనాటి మనుష్యులజీవ భావాలు, ఆదర్శాలు ఇత్యాదులను కొంతవరకు చూడవచ్చు. ఈ రచనలలోని కవిత్వపు కళ కొన్ని పట్టులలో పరాకాష్ఠను చెందింది. ఆంధ్రసాహిత్యానికి ప్రజాసాహిత్యం కీర్తి తెచ్చింది. కాని దీనికి తగిన గుర్తింపు పండితలోకంలో నాటికి [illegible] దీనిని గుర్తించి ప్రయో[illegible]వాలి.

## కథాకాలం

[illegible] రచనలైన ప్రబంధాలకి [illegible] పీఠికలో [illegible] ఉంటాయి. కవిస్తుతి, [illegible]నిస్తుతి ఇత్యాదులవల్ల గ్రంథరచనా కాలాన్ని సుమారుగా అయినా గ్రహించవచ్చు. జంగంకథల తత్త్వం దీనికి భిన్నంగా ఉంది. వీటిలో వెంకటి జంగంకథా కవులను స్మరించడంగాని, లేక తమకు ముందు రచించబడ్డ జంగంకథల ఘనతను చెప్పడంగాని చెప్పదగినంత కనబడదు. ఇట్టివిఉంటే ఆ రచనల ముందు వెనుకలు కొంతవరకు నిర్ణయమవుతుంది. 'కమ్మవారి పణతి - పసులబాలరాజుకథలో నల్లతంగాల్ కథలోని మూధేవిపాత్ర ఉదహరించబడింది. ఇట్టి నిదర్శనాలు చాల తక్కువ. ఈ కథలనుముందు ఒక్కొక్క ప్పుడు కథనుపాడే అతనుచేసిన దైవస్తుతి మాత్రమే కనబడుతుంది. ఈ పద్యాలే మిగతకథల కొన్నిటిలో కనబడతాయి.

కాని ఇక్కడ ఒక మేలుఉంది. జంగంకథలన్నీ యథార్థంగా జరిగిన చారిత్రక ఘటనలను ఆధారం చేసుకొని రచింపబడినవి. కాబట్టి ఆ ఘటనల కాలాన్ని తెలుసుకోగలిగితే కథారచనా కాలాన్ని తెలుసుకొన్నట్టే. ఈ మాత్రం ఆధారంకూడ లేకపోతే ఇవి చీకటిలో అడవి ప్రయాణంలాగుంటాయి. అంతా శుద్ధకల్పనలాగు పైకికనబడే బాలనాగమ్మ కథకికూడ కొంత చారిత్రకాధారం లేకపోలేదు. కమ్మవారిపణతి - పసులబాలరాజుకథకూడ ఇట్టిదే! ఈ కథలలోని అంతరంగికాధారాలమీదే ఆధారపడ

* నేలటూరి వెంకటరమణయ్యగారి 'ఆంధ్రులచరిత్ర, పుటలు 64, 65.

వలసుంది. పాటగాళ్ల నోళ్లలోపడి నానారూపాలు పొందినా, ఉన్నంతలోనె విచక్షణ అవసరం.

## వాఙ్మయం

జంగంకథలలో కాంభోజరాజుకథ క్రీస్తు పూర్వపు రచన అని చెప్పవచ్చు. ఆంధ్రులు తెలుగు దేశానికిరాక పూర్వం కాంభోజాలు ఈ దేశానికివచ్చిన నాటికథకావచ్చు. నల్లతంగాళ్ కథకూడ పాతదే! మధురను పరిపాలించిన సుక్షత్రియులైన పాండ్యుల నాటిదైతే క్రీ. శ. 700 కి పూర్వందనే చెప్పవలసుంటుంది. చిన్నమ్మకథ క్రీ.శ. 1200 కి ముందుదేమో! పల్నాటి వీరకథ 1190 ప్రాంతంలో జరిగింది. ఇంచుమించుగా అప్పటిదే కాటమరాజు యుద్ధం. ఏదయినా వీటిలో ఒకటీగూడా కాంభోజ రాజుకథకి సమీపంలోవి కావు.

మన గ్రాంథిక సాహిత్యంలోనిదైన నన్నెచోడ దేవుని కుమారసంభవం క్రీ శ. 850 నాటిది. తమిళ భాషలోని తొల్కాప్పియమ్ ' క్రీ. శ ప్రారంభం నాటిదికావచ్చు. కన్నడంలోని కవిరాజమార్గం నన్నెచోడ దేవుని రచనకు కొంచెం ముందుది కావచ్చు. తెలుగులో నన్నెచోడ దేవునికి పూర్వమున్న సాహిత్యం దొరకకపోడానికి కారణాలు లేకపోలేదు. మొదటి కారణం మతవిప్లవాలు. ఆంధ్రదేశచరిత్ర కొంతవరకు నికరంగా బౌద్ధమత విజృంభణకాలంనుంచి తెలుస్తూంది. అది క్రీస్తుకి పూర్వం 300 నుంచి మంచిదశలోఉంది. ఆంధ్ర రాజుల పరిపాలననాటినుంచి ప్రారంభిస్తూంది. వారు క్రీ. శ. 300 ప్రాంతంలో అంతరించేరు. తెలుగు దేశంలో బౌద్ధమత ప్రసిద్ధికూడ అంతరించింది. కొన్ని ప్రాంతాలలో జైనమతం వృద్ధిపొందింది. పైకాలమంతా హిందూమతం సామాన్యస్థితిలో ఉంది. కాని బౌద్ధమతపతనానంతరం విజృంభించింది. క్రీ. శ. 650 నుండి క్రీ. శ. 800 దాక కుమారిలభట్టు, శంకరాచార్యులు హిందూమతాన్ని ఉద్ధరించేరు. బౌద్ధజైనమతాలు విజృంభించిన కాలాలలోనూ, ఆనాటి హిందూమతంలోను తెలుగు గ్రంథాలు లెక్కలేనన్ని పుట్టి ఉండాలి. బౌద్ధ జైనాలు నశించడంతో వాటికి సంబంధించిన గ్రాంథిక వాఙ్మయం, జానపదగేయ సాహిత్యంకూడ నశించే యని చెప్పవచ్చు. నాశనంకావడానికి వీలులేని రాళ్లు రప్పలు, శిల్పం, గుహాలలోని చిత్రాలు మిగిలేయి. ఆనాటి తాళపత్ర గ్రంథాలు పొరపాటున ఎక్కడేనా మిగిలిఉండవచ్చు. అట్లే జైనమతం కూడ తెలుగుదేశంలో ఏఒక్క చోటయినా మిగిలితే - ఈనాటి విప్రవినోదుల మతం జైనమత మంటారు - ఏవో కొన్ని జానపదగేయాలయినా మిగిలిఉండవచ్చు. ఏదయినా పూర్తి పరిశోధన అవసరం. ప్రాచీనకాలానికి చెందిన కాంభోజరాజు కథే, దానిలోని విచిత్రకల్పనవల్ల మిగిలిందని చెప్పవచ్చు. అంతేకాదు దీని కల్పనే తర్వాతి జంగం కథలకు కొంతవరకు మాతృక అయింది.

——(౦)——

# హరికథా కాలక్షేపము

శ్రీమతి మల్లవరపు హనుమాయమ్మ

అదొక గ్రామములెండి. ఏవో నాలుగైదిండ్లు పెద్దపెద్ద రెడ్లవారివితప్ప, మిగతవన్నీ సామాన్య కుటుంబములోనివి. ఆ గ్రామమునకు, చుట్టుపట్లనుండు గ్రామములలో, ఒక గొప్ప హరిదాసుగారిచేత కొన్ని హరికథలు జరిపించారు. ఆ హరిదాసుగారు గొప్ప కవికూడాను. సరే ఆ గ్రామములో కూడా ఆయనచేత నొక కథ చెప్పించుటకై ఏర్పాటు చేయబడ్డది.

ఆ రోజు భోగిపండుగనాటి మరుసటి దినము. కష్టజీవులైనపల్లె ప్రజలంతా, వారి వారికి తగినట్లు ముస్తాబుచేసుకొని, తమ పిల్లలతోటి ముఖ్యముగా గృహిణిలు సంతోషముగా నుండిరి. సరే ఆరోజు గ్రామంలోను, పొలాల్లోను, ఎచ్చుటచూచినా, ఆనాటిరాత్రి జరుగబోవు హరికథను గురించి ముచ్చట్లే.

ఆ ఊరి పెద్దరెడ్డిగారింట్లో హరిదాసుగారికి ఒక గొప్ప విందుచేశారు. ఇక చెప్పేదేముంది హరిదాసుగారు తృప్తిగా భుజించారు.

ఇక హరికథా ప్రారంభమునకు జరిగిన సన్నాహములు – కథ ఆ వూరి మందిరములో జరుగునట్లు ఏర్పాటు. ఒక పెట్రమాక్సులైటును సాయంత్రం ఆరున్నర గంటలకల్లా వెలగించారు. మద్దెల హార్మోనియంవారు హాజరైయారు. శ్రీ సీతా రామ, లక్షణ, భరత శత్రుఘ్న హనుమస్సమేతముగా నుండు ఒక పఠమును వుంచారు. సరే మన హరిదాసులవారుకూడ కథ చెప్పుటకు సిద్ధంగా వున్నారు. కథ "శశి రేఖాపరిణయం"

కాని ఆ ఊరి పెద్దరెడ్డిగారు ప్రక్క గ్రామానికి వెళ్లినందువలన, వారు వచ్చునంతవరకును, కథ నారంభింపరాదని వుత్తరువు. పాపం! గ్రామప్రజలు హరిజనులతో సహా, రెడ్డిగారి రాకకై ఎదురు చూచుచుండిరి.

ఇక రెడ్డిగారు ఎట్లాగో ఒకట్లు పడ్తూ లేస్తూ హడావుడిగా రాత్రి 9–30 గంటల కల్లా గ్రామాన్ని చేరుకున్నారు. పాపం! ఆయనగారిది కొంచెం బరువైన శరీరంలెండి, అందుకే అంత ఆలస్యం! ఇంకేం, వారుకూడ పొంగలితోసహా కడుపునింపుకొని, బేవుబేవుమని త్రేపుకుంటూ గ్రామ మందిరములోనికి ప్రత్యక్షమయ్యారు. అప్పటికే, లైటులోని కిరసనాయిలు సగం ఖాళీ! మందిరంలో, గుమికూడిన వారి హడావుడి చెప్పనక్కర లేదులెండి.

మన రెడ్డిగారు హరిదాసుగారితో "కానీండి, కానీండి ఇప్పటికే చాలప్రొద్దుపోయింది. ఇక కథ జరగనీండి" అని తన బుర్రమీసాలను సర్దుకుంటూ, గోడనానుకొని చతికిల పడ్డారు శ్రీరాములవారి పఠమునకు కర్పూర ధూపదీప నైవేద్యములు జరుపబడ్డాయి. హరిదాసుగారు

"శ్రీమద్ రమారమణ గోవిందా గోవింద" అంటూ కథ నారంభించారు. అప్పటికే కునికిపాట్లు పడుతున్న కొందరు, "గోవిందా, గోవింద" అని భగవన్నామ స్మరణలు చేశారు. ఇక అచ్చటికి వచ్చిన జనం ఏవిధంగా హరికథ విన్నారను కొన్నారు!

"రే, ఎంకటిగా, రెడ్డొచ్చాడురా రెడ్డి, అదిగోరా, చుట్టతాగతానూ, కతినరా కత" అని కునుకుపాట్లు పడుతున్న వెంకటి గాణ్ణి ప్రక్కనున్నవాడు ఒక గ్రుద్దు గుద్దెను.

ఒక వైపునుండి "మ్మే, సుబ్బే, ఆడ సూడే నాయమ్మో, ఆ 'లాంపు' ఆ ఎలటరు (పెట్రమాక్సులైటును చూచి) ఎట్టా యెలగతా వుండాదోను అని ఒక గృహిణి.

"ఓ యక్కల్లా, ఆ కత సెప్పేయన్న సూడే తల్లా, ఎట్టా పాడతా వుండాడోను! అదేందమ్మా, ఆ మద్దిలాయున ఆ యిందగా తలూపతాను!" అని మరొక గృహిణి.

"చెంచో, మ్మే, నిన్న నువ్వావూరికాడి బాగోతాని కొచ్చావటే, ఆ రాధ యేసం యేసినాయన, ఎంత బాగున్నాడమ్మే! దుమ్ము రేపేసినాడు కూతరా" అని ఒక స్త్రీ.

"ఓ పిన్నే, అంత సున్నముంటే పెట్టా, వుత్త ఆకొక్కటుందే" అని మరొక స్త్రీ.

"యాందమ్మా ఈ రబసం, కత ఇన దానికొచ్చి, ఏదంమ్మా, మీా అరుపు, అయ్యోరామ!" అని ఒక పడుచు పిల్ల

ఇంతలో "శ్రీమద్ రమారమణ గోవిందా గోవింద, ఆంజనేయ వరద గోవిందా, గోవింద" అని మన హరిదాసులవారు. (నిద్రపోవువారందరు ఉలిక్కిపడి, గోవిందనామస్మరణలు చేయటం.) హరిదాసుగారు, ఘరల కథనారంభించారు. సరే ఇద్దరు గృహిణులు లేచి పోవుచుండురు. ఇంతలో ఒక ముదుసలి దగ్గు కొంటూ "యామంటే పోతావుండారు" అని ఆ వెళ్లువారిని ప్రశ్నించగా

"నువ్వు తాళేయమ్మా, నాబిడ్డేడస్తా వుండాడేమోను, ఇంటికాడ ఒక్కణ్ణే మంచంమీాద పండేసొచ్చాను కూతరా" అని ఒక కాపు గృహిణి జవాబు.

"ఆ పోకేంచేయమంటావమ్మా, యాం అందమమ్మా ఈ హరికత, మస్తుగ పిట్ట కతలు చెప్తేగదా ఆయన్న, అదేందమ్మా ఎంతసేపైనా, ఆయన్న నిల్చుకొనే కత చెప్తాడు" అని రెండవ స్త్రీ, ఒక పెద్ద పొగాకు కాడను వడ్రిప్పుతూ, చీర దుమ్ము విదిలించుకొంటూ, వెళ్ళిపోయెను.

ఇంతలో మరొక గృహిణి "మ్మే, అంకో, ఆడుండే నాయమ్మా, నేనుకూడ వస్తాను, రేపుమాయత్త యేడుాడి. ఇంటికి సున్నం కొట్టా, కొట్టా, వచ్చానమ్మా," అని తనుకూడ వారివురిని వెంబడించింది.

"ఏం లలితా, నిన్న నీా మామగారు ఒక క్రొత్త చీర తెచ్చారటగా."

"ఆ బలే చీర తెచ్చారులే కమలా! అటువంటి ముతక చీర తెచ్చి నా మొహాన పడేయకుంటే, ఆ వెలలోనే, మంచి 'వాయిల్' చీర తేకూడదూ! దేనికీ అదృష్టముండాలిగా ఆమాటంత్తానంటే, మా అత్తగారు మండిపడతారు. ఇక్కడ కూడా ఎందుకు [redacted] పురాణం! లక్షణంగా కథ విందాం పట్టు" ఇలా అచ్చటికి వచ్చిన బ్రాహ్మణ గృహిణుల ముచ్చట్లు.

కథలో ఘటోత్కచుడి విషయమై, హరిదాసుగారు చెప్పినపుడు, "ఓయమ్మో యమ్మో! ఆయనెట్టాటి రాక్షసుడే నా తల్లో!" అని ఒక స్త్రీ తన ప్రక్కనున్న ఆమెతో అంది. ఆమె వెంటనే నోటిలోని తాంబూలమంతయు వుమ్మేసి "అవునక్కలా, ఆ బజారుకాడ ఆ పిండోంటలంతా, ఎట్టా తినేసుంటాడు వాడినా" అని మూతి మీద వేలు పెట్టుకుంది.

వచ్చిన గృహిణులందరిలో కొందరు ఈ విధంగా హరికథ వింటుంటే మందిరం లోపలి భాగంలో, నొక కుర్రవాడు, "రే, బుడ్డా, సీతారామయ్యోరి, తాటిచెట్లో తాటి గెలన్నీ తెగనరికేయాలరా ఈ రాత్రికి, ఇదేరా సందు, రే, రారో పోదామాడికి" అని తన ప్రక్కనున్న స్నేహితుని హెచ్చరించాడు.

మరొక వైపున, ఒళ్లు తెలియకుండా, గుర్రులు పెట్టి నిద్ర పోతున్న ఒకనిని మరొకడు, ఒక పీకుపీకి, "రే, నల్లయ్యా, ఒక్క బీడీ ముక్కుంటేఇస్తావట్రా, ఆ సాయిబువాయూల అంగటికాడ లేద్రా ఈయాళ," అని.

"యాందొరే [redacted] గొఱ్ఱె" అని గొఱ్ఱెల కాచువాని కలవరింతలు.

ఇంతలో లైటులో కిరసనాయిలు, పూర్తిగా అయిపోయింది. అవలా బవలా రెండు లాంతర్లు వెలిగించారు. కథ పూర్తికావచ్చింది.

కోడికూతలు, పక్షుల కిలకిలారవములు, "యాందీ ఎద్దో," అంటూ, ఒక రైతు, రెండు ఎద్దులను తోలుకొని, కపిలతోలుటకై, పొలమువైపు పోవుచుండును.

మరునాటి ప్రొద్దున, రాత్రి జరిగిన హరికథను గురించి, గ్రామ గృహిణులను కొందరిని ప్రశ్నించితే, "కతా! హి! హీ! అదే దోనబ్బ, సరిగ్గానే అర్థంకాలా, యాడమ్మో, ఒకటే తూగు, అదేనమ్మో "చిచిరేక పరినం." అని ఒక గృహిణి.

"ఆ, యాంకతంటే, అదే, 'చచిరేక' అని మరొక గృహిణి. కథపేరు 'చచిరేక' అని, సుబద్రమ్మ అన్నపేరు, అదేందో అయ్యాటమ్మో పూర్తిపేరు మరచినావనియు, ఆ చచిరేకమ్మ పెనిమిటి పేరు కూడ, మరచిపోయామనియు జవాబులు. పాపం! ఈ విధంగా వీరందరు, హరికథా కాలక్షేపమును జరిపిరి. అయితే కొద్దిమంది గృహిణులకైనా, ఆ కథ అర్థమయిందేమోలెండి!

మొత్తానికి, హరిదాసుగారు, "శశిరేఖా పరిణయమును" అత్యద్భుతముగానే చెప్పారు. కాని పాపమీ అమాయకపు పల్లె ప్రజలెక్కడ! ఇంకను వీరు ఈ విధంగా అమాయకత్వములో నున్నారు. అయితే, ఇప్పుడు 'వయోజన' విద్యకు అందరూ పాటుపడుతున్నారుగా, దానివల్ల లాభం త్వరలోనే వుంటుందేమో!



విలాసిని

# స్వామినాథన్

మూలం :
శ్రీ ఆర్. కె. నారాయణ్



స్వేచ్ఛానువాదం :
శ్రీ చీమలపాటి సూర్యనారాయణ

(గతసంచిక తరువాత)

[ . పాఠశాలనుండి తప్పించుకొనివచ్చిన విషయం రాజంతో చెప్పేసరికి స్వామిని రాజం చీవాట్లు పెట్టాడు. దాంతోటి తాను పరారిఅయి పోబోతున్న విషయం చెప్పడం మంచిదికాదనుకొని తననిర్ణీత కార్యక్రమ నిర్వహణ కుపక్రమించాడుస్వామి. స్వామి తిరిగి అన్నంనీళ్లులేకుండా ఒక అడవిలో దారి కడ్డంగా సొమ్మసిలిపోయి పడిపోయాడు. అతనిని ఒక ఎద్దుల బండివాడు తన యజమానికడకుచేర్చి సపర్యలు జరిగిన ఫలితంగా స్పృహవచ్చి కోలుకున్నాడు. స్వామి అతనికి కృతజ్ఞత తెలిపాడు కాని తాను ఆడవలసియున్న క్రికెటుమేచి జ్ఞాపకమువచ్చి తన్ను రక్షించి, ఆదరించిన జిల్లా ఫారెస్టురేంజి ఆఫీసరుకు చెప్పనైనా చెప్పకుండా పలాయన మంత్రం పఠించాడు. స్వస్థలానికి చేరగానే అతని స్నేహితుడు మణి కనుపించాడు స్వామి తన అనుభవాలను వివరించి క్రికెటుమేచిని గురించి ఆదుర్దాగా అడిగాడు — యిక చదువండి.]

"ఎవరన్నారు ?"

"ఆ ఫారెస్టాఫీసరే !"

"నీది మట్టి బుర్రయ్యా' అని వాడికి పోయి చెప్పు !"

మణి చెప్పినవరకూ స్వామికి తెల్సిందే గాదు, అప్పుడే ఆదివారం దాటి పోయిందని !

"అయితే — వాఁడికుత్తరం వ్రాయను. నాఁకు దగాఁజేసాఁడు !"

"ఎవరూ ?"

"ఆఫారెస్టాఫీసరే ...అయితే రాజం నాగురించేమయినా చెప్పాడా ?"

"రాజమ్ చాలా చెప్పాడు, కానీ, వాడు చెప్పిన విషయాలు నీతో చెప్పను. ఐతే — నీతో వొక్క విషయం చెప్పవల్సివుంది ! వాడి సముఖానికి మాత్రం యెప్పుడూ వెళ్ళకు. నిన్ను చూడఁగానే, కాల్చి చంపేస్తాఁడు !"

"నేనేం చేసానని ?"

"యింకేం చేయాలి. ఎం. సి. సి ని ధ్వంసం చేసావ్ ! నువ్వు వూరువిడిచి పోయేముందైనా చెప్పావా రాజని ? పోనీ - రాజంను స్కూల్లో కల్సుగున్నపుడు చెప్పక పోయావా ? అలా యెందుకు చెప్పకుండా మభ్యమరచావో, రాజమ్ తెల్సుకునేందుకు కుతూహల పఁడుతున్నాడు !"

ఇలా కొంతకాలం గడిచిన తరువాత.—

"మళ్లీ స్కూలుకు వెళ్లేవుద్దేశముందా ?" అని మణి ప్రశ్నించాడు.

"అవును. మరుచటి వారమే మా నాన్నగారు హెడ్మాష్టర్ను కల్సుకుని మాట్లాడేరు."

## 24

పదిరోజుల తరువాత, ఒకనాటి మంగళవారం వుదయం గం. 5ల సమయమప్పుడు స్వామి పక్కమీఁదనుండి లేచాడు. మాల్గుడి స్టేషనకు రైలింకా వచ్చేందుకు అరగంట వ్యవధి మాత్రమేవుంది. తానేమయినా ఆలస్యం చేసినట్లయితే రాజమ్‌ను రైలుతీసుఁగొని పోతూందని స్వామి గబగబా బయలుదేరాఁడు!

రాజమ్ తండ్రికీ వూరునుండి బదలీ అయినట్లు మణి చెప్పేవరకు పాపం, స్వామికీ విషయం తెలియనే తెలియఁదు. తనకు వారం రోజులక్రిందటే యీ విషయాన్ని రాజమ్ తనకు చెప్పాడని, కానీ స్వామికి మాత్రం తెలియఁజేయవద్దని మణి అన్నాడు! కానీ ఆఖరికిరాజమ్ మాటకు వ్యతిరిక్తంగా మణి ప్రవర్తించవల్సి వచ్చింది!

అంతకు తొలినాఁడు. —— .

"రేపుదయం గం 5 లకు నన్ను పిలవగలవా మణీ!" అని స్వామి అడిగాఁడు!

"పిలవలేను. రాజమ్ యింటిదగ్గరే పఁడుక్కొని, అతనితో కూడా స్టేషన్కు వెళ్ళ నిశ్చయించాను!" అని ఖచ్చితంగా సమాధానం చెప్పాఁడు.

తనను మణి విడిచి పెట్టిన తరువాత (తొలినాడు) తన పెట్టెను దెరచి, దేనిగురించో అట్టే వెతకసాగాఁడు.

ఆ పెట్టెలో యేదో మంచి వస్తువునుఁదీసి, దానిని బహుమతిగా రాజమ్ కియ్యాలని స్వామివుద్దేశ్యం.

ఇంతకీ ఆ పెట్టెలో వివిధరకాలైన యినపవస్తువులు గుట్టలగా అనేక యంత్రాలకు సంబంధించినవి పడివున్నాయ్! యింకా ఆ పెట్టెలో ఒక అట్ట చేతిరిష్టువాచి, కేటలాగు, బొమ్మల పుస్తకం, బోల్టులు (Bolts) నట్టులు (Nuts) వున్నాయ్.

అరగంట యోచన సాగించిన తరువాత, యిందులో రాజమ్‌కు బహుమతిగా యివ్వవల్సిన వస్తువేదీలేదని పెట్టెమూసివేసాడు! రాజమ్‌కు కథలు పుస్తకాలు చదవటమంటే యెంతో అభిలాషను జ్ఞప్తికిఁదెచ్చుగున్న స్వామి —— ఏదైనా మంచి పుస్తకం బహుమతిగా యివ్వాలనుకున్నాడు.

తన క్లాసుపుస్తకాల్లో యేదయినా ఒక పుస్తకాన్నిస్తే బాగుంటుందేమో అని తర్జనభర్జనలు చేయసాగాఁడు!

క్లాసు పుస్తకాలను బహుమతిగా యివ్వటం మర్యాదగా వుండదనుకున్నాఁడు! స్వామి ఆలోచించగా, చివరకు 'Andersons Fairy Tales' యిచ్చేందుకు నిశ్చయించాడు. ఆ పుస్తకం మీఁద మాత్రం. –

"నాప్రియమైన స్నేహితుఁడు రాజమ్‌నకు!"

అని వ్రాశాఁడు.

## 25

'Andersons Fairy Tales' పుస్తకంతో స్వామి మాల్గుడిస్టేషన్ను చేరుకునే సరికి, వుదయం యింకా చీఁకటిగానేవుంది. అప్పుడే స్టేషనుమాష్టరు పడఁక మీఁదనుండిలేఁచి, లాంతరు ముందరఁగూర్చుని యేమిఁటో రాసుఁగు పోతూన్నారు!

ఎవరిదో కారు స్టేషను బయట ఆఁగింది. ఆ కారునుండి – రాజమ్, రాజమ్ తండ్రి, తల్లి, తనకు తెలియని వ్యక్తొకరు, మణి, బయటకు దిగారు.

ఒక్కక్షణంలో ప్లాటుఫారమంతా – పోలీసులతోను, పోలీసాఫీసర్లతోను నిండిపోయింది!

ఇంతలో రైలు దూరాన దృష్టిలోకి వచ్చింది. 'హిస్, హిస్'మనుకుంటూ రైలు క్రమంగా ప్లాటుఫారముదగ్గరకువచ్చి ఆగింది. రెండవక్లాసు తరగతిలోకి సామానులన్నీ ఎక్కించఁబడ్డాయి. రాజమ్ తల్లి లోనికిపోయిఁ గూర్చుంది. రాజమ్, అతని తండ్రి కంపార్టుమెంటు ప్రక్కన నిలుఁబడియున్నారు.

స్వామి మణినిఁ జూచాడు.

"మణీ, రాజమ్ వెళ్ళిపోతున్నాఁడుగఁదూ?" అని ప్రశ్నించాడు గద్గద స్వరంతో.

"అవును, స్వామీ ! వెళ్లిపోతున్నాఁడు ! ”

“మణీ! రాజమ్ నాతో మాట్లాడుతాడా ? ”

“తప్పకుండా. ఎందుకు మాట్లాడ్డూ”

ఇప్పుడు, — రాజమ్, అతని తండ్రి, కంపార్టుమెంటులోనికిపోయి కూర్చున్నారు; తలుపుమూసి వేయబడింది.

“మణీ, యీ పుస్తకం తప్పక రాజమ్‌కందఁ జేయాలి!” స్వామన్నాడు. ఆలస్యంచేసేందుకిఁక వ్యవధిలేదు. గంట మ్రోగింది. మణి చప్పట్లు చరుస్తూ.—

“యిక్కడే స్వామి వున్నాడు; నీకు తన కృతజ్ఞత తెలుపమన్నాడు” అని మణన్నాడు రాజమ్‌తో.

రాజమ్ శిరస్సు కిటికీలోనుండి బయటకువచ్చి.—

“గుడ్ బై మణీ, నన్ను మరిచిపోకుండా వుత్తరాలు రాస్తూండు” అని అన్నాడు.

“గుడ్ బై, రాజమ్ ... యిక్కడే స్వామున్నాఁడు.” మణి చెప్పాడు. నిశ్చలమైన స్వామి దృష్టి రాజమ్ దృష్టిలో లీనమైంది. అప్రయత్నంగా.

“రాజమ్, రాజమ్, నువ్వు వెళ్ళిపోతున్నావా? మరల యెప్పుడొస్తావ్?” స్వామి రుద్ధకంఠంగా అన్నాడు. రాజమ్ మాత్రం నిశ్చలంగా చూడసాగాఁడు స్వామివయిపు! ఏమిటో చెఁబుదామని నోరువిప్పి మాట్లాడఁబోయాఁడు.

కానీ-రైలుయింజనుయొక్క కూత, రాజమ్ మాటలను స్వామికి వినఁబడనీయకుండా చేసింది! రైలు కదలసాగింది.

“మణీ! మణీ! యీ పుస్తకం రాజమ్‌కుచేరాలి!” అని స్వామి మణి కందించాఁడు. మణి రైలుతో సహా నడుస్తూ.—

“గుడ్ బైరాజమ్. స్వామి నీకీ పుస్తకాన్నియ్యమన్నాఁడు!” అన్నాఁడు.

పుస్తకం గురించి రాజమ్ బయటకు చెయ్యిజాఁచి, తీసుఁగున్నాఁడు. నవ్వుతూ, స్వామివయిపుజూస్తూ, చెయ్యూపాఁడు. స్వామిగూఁడా చెయ్యూపాఁడు.

స్వామి, మణి ఒకే దగ్గర నిలబడి, పరుఁగెత్తే రైలును పరీక్షిస్తున్నారు!

“మణీ! నేనిచ్చిన పుస్తకాన్ని రాజమ్ తీసుగున్నందుకు నాకు చాలా సంతోషంగావుంది. మణీ, నావైపుజూచి చెయ్యూపాఁడుఁ తెలుసా? రైలు కదిలేసమయానికి — యేదో చెప్పాడు” అని స్వామన్నాడు.

“అవునవును!” అన్నాడు.

“నాగురించెప్పడైనా తలుస్తూవుంటాడంటావా మణీ!” స్వామి ప్రశ్నించాఁడు!—

“తప్పకుండా! మరేం విచారించకు! నీతో వాఁడు మాట్లాడకపోయినా, వుత్తరం రాస్తాడులే!”

వీరిరువురూ యింటికిపోతూ, దారిలో మణన్నాఁడు!!

“నీ మొహం!”

“లేదయ్యా, నాతో చెప్తే!”

“కానీ, వాడికి నాచిరునామా తెలియదే!”

“వాడు నన్నడుగులే, నేనిచ్చానులే!” మణన్నాడు!

“లేదు, లేదు. అది పదహారణాల పచ్చినగ్న సత్యం. అయితే నాచిరునామా యేమిటో చెప్పు చూదాం!” స్వామి నిలఁదీసి అడిగాడు!

“అది - అది - మరేం భయపడకు; రాజమ్‌కిచ్చానులే!” మణన్నాడు. స్వామి మణిముఖంలోకి ఒకమారు, జూచాడు.



# నిస్పృహత

శ్రీ దొండపాటి రామమూర్తి

(సెప్టెంబరు సంచిక తరువాయి)



తనకష్టంబెదిరింపగోపుఁడు మనస్థైర్యాయుధం బూనినం
తన పిత్రార్జితమైన భూస్థితి నొకింతన్ దక్షణమ్మమ్మి సా
ధనమే ముఖ్యమటంచు నెంచెఁ దొలుతన్, దర్వాత నూహింప నా
తనికవ్వొత్తుఁగఁ జిత్తమడ్డిగఱఁగన్ దైన్యంబు చేకూఱఁగన్ ॥

అరిగెన్ గోపకుఁడీ ప్రసక్తి విని సాయాహ్నద్వయం బిడ్డనున్
గరితా! దెబ్బదియేండ్ల కెక్కుడుగ నాకష్టాప్తిచేఁదీఱె, నం
దఱమున్ మంటిమి వెల్లడైన భగవత్కారుణ్య సూర్యప్రభా
గరిమన్ నెమ్మదిగా గతింపను పరాక్రాంతమ్ములైనన్ మదుల్ ॥

మనగతిదుర్గతి వావలె నినుఁడున్ జాఱుకాటయుఁదెది యెప్పటికైనన్
మనఁగాంచితిఁ దుదకవివేకినయి మదీయమగు వంశకీర్తికి వెలిగాన్ ॥

మనయెడ ద్రోహచింతఁ జెడుమార్గమునన్ జరియించెనేని, యా
తనిఁ గుజనుండనందగు ; యథార్థపరుండగునేని, యిట్టిక
ష్టనిచయమొక్కవేయికి విచారము గూర్పఁగలేదు సైతునా
మనుజుని ; మానమెక్కుడిటుమాటల నాడుటకంటె నెంతయున్ ॥

ప్రారంభించితిఁ బ్రస్తుతాంశము వచింపంబూనితో ర్తన్ బ్రతీ
కారోక్తుల్ సువిచారముల్ మనల నింకన్ బాయులోకుండు కే
దారప్రాతమనన్య సాధ్యమయి స్వాతంత్ర్యమునన్ నిల్చె ; స్వే
చ్ఛారూఢిన్ బయిపీచుగాలికేనయానా భూమివాఁడొందుతన్ ॥

దాయాదుండు మఱొక్కఁడుంటవినలేదా! మున్ సుశీలా! యతం
డీయాపత్సమయమ్మునందగును జుమ్మీ ప్రాపు, వ్యాపారమం
దాయమ్మొంది పురోభివృద్ధిగనువాఁడై యాతఁడున్నాఁడు, స
ర్వాయత్తుండయిలోకుఁ డీతని నవశ్యం బేగి చేరన్ వలెన్

మనచుట్టమ్ము సహాయుఁడౌటను వింతద్రవ్యవ్యయాసక్తిచే
మనలోకుండు వెలార్చి నష్టము వెసన్ మాతాపితాహ్లాదియై
మనలన్ గ్రమ్మఱఁజేరవచ్చు నిటనెమ్మాడ్కిన్ బ్రవర్తించియే
మొనరించున్? ఫలమేమి? యెల్లఱుదరిద్రోపాధులైయున్నడన్'' ॥

వృద్ధుఁడాగిపోయె నింతటితోడుత మాటలాడకుండె మనసుశీల
యామెమనసు చాలనల్లకల్లోలమై కనుచునుండె పూర్వకాలవిధుల ॥

"కలఁడు చిరంతనుండతనికై ప్రజలంగఱుఁజేరియల్లకో
వెలయెదుటన్ బిరానజత వెట్టిరి బేడలనాలు కానులున్
విలిచిరిగంపనిండ నొక పెట్టునఁ జిల్లరవస్తు జాతమున్
దలపయిగంపనెత్తుకొని దాతకుఁడేగెను చెన్నపట్నమున్ ॥

ఒకయజమానునొద్దఁ గొలువుండెనితండు దయార్ద్రబుద్ధి స
మ్యకమగువీనినాతఁడతి మాత్రతదీయ సముద్రవర్తకా
దికమొనరింపఁబంపె జలధిందరియించిచనంగఁ; గొం
డొకతఱి కాతఁడద్భుత మహోన్నత సంపదఁగాంచె నచ్చటన్ ॥

విడిచెన్ బిమ్మట బీదసాదలకునై పృథ్వీస్థితుల్ ద్రవ్యముల్
గుడిగట్టించె స్వదేశమందునఁ బరక్షోణి స్వయానీతమౌ
నుడురాట్కాంత శిలాధగద్ధగితమైయొప్పారు గ్రీనేలతో"
వడినీయూహాలునిట్టి వెన్నొహౌడమెన్ స్వాంతమ్మునందింతికిన్ ॥

వికసించెన్ సుదతీముఖాబ్జమపుడా వృద్ధుండు సంతోష పూ
ర్వక చిత్తాప్తివచించెనిట్లు "దివసద్వంద్వమ్ముగా నన్నపా
నకలాపాదిక మీయుపాయమొకటే నాకయ్యెనే యింతియి
తకు నష్టమ్మునకంటెఁ జాలనధిక ద్రవ్యమ్మె నిల్చెంజుమీ ॥

వలసినంతమనకుఁగలదు నిజమ్ముగాఁ దలఁతునింతకంటె నలఁతినగుట-
నఋనసీ యుపాయమగు మంచియాశయ మింకజరుపుమిట్లు శంకలేక ॥

మంచిలోకుదుస్తులెంచి మంచివిగూర్పు మింకవిలువు మతనినేగనిమ్మ
తేపొమఱుదినమ్ము మాపొ యీ నాటికే చాలెనేనిపోవఁ జనునురాత్రి ॥

ఇటవిరమించియేగె భరమేదిన డెందముతోడ గోపుఁడె
ప్పటివలెనుల్లకున్, గృహిణి పంచదినమ్ము లహర్నిశమ్ములున్
తృటియువిరామమొందకొనరించుచునుండె సుతప్రయాణసం
ఘటనకవశ్య వస్తుతతి- కార్యచణాంగుళులన్ దినాంతమున్ ॥

(సశేషము)






## చింత చిగురు పచ్చడి

చింత చిగురు పట్టెడు, 10 ఎండుమిరపకాయలు, కాస్త ఇంగువ, ఒక చంచా ఆవాలు, చిటికెడు మెంతులు, పిడికెడు నువ్వులు తీసివుంచవలెను. ఆ తర్వాత బాణలిలో $\frac{1}{2}$ పలం మంచినూనె పోసి కాగిన తర్వాత ఇంగువను వేయించి, తీసుకొని వుంచుకొన్న మిరపకాయలు వేసి నేరేడుపండుచాయగా వేయించి, ఆవాలు, మెంతులు, వేసి చిటపట అనగానే తీసి వుంచుకొనవలెయును. మళ్ళా $\frac{1}{2}$ పలం మంచినూనెపోసి వుంచుకొన్న చింతచిగురు వేసి కొద్దిగా వాడ్చి తీసి వుంచవలెను. తరువాత నువ్వులువేసి ఎఱ్ఱగా వేయించి తీసి వుంచవలెను. మిరపకాయలు తొడిమలు తీసి ఆవాలు, మెంతులు, వగైరాలను చేర్చి, కొద్దిగానీళ్ళు చల్లి మెత్తగా నూరి వుంచుకొన్న చింతచిగురు, నువ్వులు వేసి కొద్దిగా నూరి వుపయోగించవలెను. ఇదేమాదిరి ఎండిన చింతచిగురును కూడ పచ్చడిగా, పొడిగా చేసుకొనవచ్చును. ఇది నిల్వవుండును, కర్చుతక్కువ.

## చింత పువ్వుల పప్పుకూర

ఎండు మిరపకాయలు 10, దనియాలు చంచాడు, కాస్త ఇంగువ, పిడికెడు బియ్యము, చంచాడు నూనెతో సువాసన వచ్చువరకు ఎఱ్ఱగావేయించి తీసిమెత్తగా పొడిచేసి వుంచుకొనవలెను. చింతపువ్వుల కాలములో గాలికి పువ్వులు రాలివుండుటకలదు. తవ్వెడు పువ్వులు శుభ్రపరిచి వుంచవలెను. $2\frac{1}{2}$ పలం ఎఱ్ఱగడ్డలు, 4 పచ్చిమిరపకాయలు తరిగి వుంచవలెను. తర్వాత ఒక ఆళాకు కందిపప్పు లేక పెసలపప్పు, మెత్తగా ఉడికించి వుంచుకొన్న పూవులను, తగినంతవుప్పు, కాస్త పసుపుపొడి వేసి, మెత్తగా వుడికిన తర్వాత, వుంచుకొన్న మిరపపొడివేసి, బాగా కలియ వుడికించి, తీసి వుపయోగించవలెను. ఈ పప్పుకూర చాలా బాగుండును.

ఎం. ఆర్. సీతమ్మ

## గోధుమరవ దోశ

గోధుమరవ తెల్లది ఒక ఆళాకు, చారెడు బియ్యం, పెరుగుతోకలిపి రాత్రి నానబెట్టవలెను. మరుసటి దినము కావలసినన్ని పచ్చిమిరపకాయలు, ఉప్పుచేర్చి రుబ్బవలెను. మెత్తగా రుబ్బిన పిండిని పెనంమీద నెయ్యిగాని, నూనెగాని వేసి దోశగాపోసి దానిమీద పెద్ద ఉల్లిపాయల చిన్నచిన్న ముక్కలను చల్లవలెను. దానిపై నెయ్యిగాని, నూనెగాని వేసి ఎర్రగాకాల్చి తీయవలెను. ఇది చాల రుచిగా నుండును. దీనికి అద్దుడు పచ్చడి అవసరములేదు.

చివుకుల సీతాలక్ష్మి

# విండర్ మియర్‌సతి విసనకర్ర

రచయిత :
ఆస్కార్ వైల్డ్

అనువాదం :
సో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.

(నవంబరు నెల తరువాయి)

డం:—ఏం ?

ప్లిం.స:—మా వారినికూడా మీతో తీసుకు వెళ్లండి. ఆయన ఎప్పుడు చూచినా నా కొంగుపట్టుకునే తిరుగుతున్నారు. నాకు చాలా చీకాకుగాఉంది. ఇటువంటి ఆవిడ ఆయనకి తగుతుంది. అది వద్దనేంతవరకూ దానివెంట నేపడుతూ ఉంటారు. అందువల్ల నా బాధ తగ్గుతుంది. అటువంటి స్త్రీలు ఇటువంటి పరిస్థితుల్లో తప్పకుండా సహాయపడతారని నేను రూఢిగా చెప్పగలను. భార్యాభర్తల సరసాలు విరసాలుగా మారకుండా ఉండేందుకు వాళ్లు తోడ్పడతారు.

డం:—మీరనేదేమిటో నాకు బోధపడటం లేదు.

ప్లిం.సతి:—(అతనివైపు చూస్తూ) మీరు అంతేగా!

డం:—నాకు నేనే అనుకోండి. ప్రపంచంలో కల్లా ఒకే ఒక వ్యక్తిని – నన్ను – గురించి నేను తుణ్ణంగా తెలుసుకోగోరతాను; అయినా దానికి తరుణం రాలేదు.

వాళ్లు బాల్‌రూమ్‌లోకి వెడతారు; విండర్ మియర్‌సతి, డార్లింగ్టన్‌ప్రభువు డాబానుండి వస్తారు.

విం.స:—అవును, అవును. [redacted] మనిషి ఇక్కడికిరావడం సహించరానిది. టీ సమయాన్ని మీరన్న విషయం నాకిప్పుడర్థమాతుంది. సంగతి విడమర్చి చెప్పవలసింది. ఎందుకు చెప్పలేదు ?

డా.ప్ర:—నేను చెప్పలేకపోయాను. ఇంకో పురుషుని గురించి ఇటువంటి సంగతులు చెప్పడం అంత బాగోదు. ఆ మనిషిని ఆహ్వానించడానికి మిమ్మల్ని ఆయన నిర్బంధపరుస్తాడని తెలిసిఉంటే, నేను మీకు అసలు సంగతి చెప్పేవాడిని ఈ అవమానానికి మీరు గురికావలసిన అవసరం ఉండేదికాదు.

వి.స:—నేను దానిని రమ్మనలేదు. నేను ఎంతవద్దని మొత్తుకున్నా ఆయన అది ఇక్కడికి ఎలాగైనా వచ్చితీరాలని పట్టుపట్టేరు. అబ్బా ఈ యిల్లు పాపపంకిలమైపోయింది. నా భర్తతో అది డ్యాన్సుచేసినప్పుడల్లా ప్రతీ స్త్రీ నన్ను తూష్ణీంభావముతో చూస్తున్నది. ఇలాంటి పరిస్థితికి గురికావడానికి నేనేమి పాపంచేసేనో! ఆయనకి నాసర్వస్వమూ

అర్పించేను. ఆయన నాజీవితాన్ని తన యిష్టంవచ్చినట్లుగా ఉపయోగించి, ఆఖరికి పాడుచేసేరు. నాకళ్ళకెదురుగుండానే ఇంత అవమానమా? నాకు ధైర్యంచాలదు - చచ్చు దద్దమ్మని! (సోఫాలో కూలబడుతుంది.)

డా. ప్ర:-మిమ్మల్నిలాగ అవమానపరుస్తున్న వ్యక్తితో ఎంతమాత్రమూ కాపరంచెయ్యడానికి ఇష్టపడరని మీ తత్వమెరిగిన నాకు బాగా తెలుసు. ఆయనతో ఇక ఎలాగ కాపరం చేస్తారు? అతడు ప్రతీ నిమిషమూ బొంకుతున్నట్లుగా మీకు తోస్తుంది. అతని వాలకము, అతనిమాట, అతని చేష్టలు, అతనిప్రేమ - సమస్తమూ బూటకమని మీకు తోస్తుంది. తక్కిన వారితో విసిగినప్పుడు మీ దగ్గిరకి వస్తాడు; అప్పుడు మీరతనికి తృప్తి నివ్వాలి. తక్కినవారిపై మోజు ఉన్నా ఆయన మీ దగ్గిరకి వచ్చినప్పుడు మీ చాకచక్యంవల్ల అతని హృదయాన్ని కరిగించాలి. మీరు అతని అసలు జీవితాన్ని మరుగుపరిచే బురఖా అన్నమాట, అతని రహస్య ప్రవర్తననిదాచే పైముసుగు.

విం.స:-మీరు చెప్పేది నిజం, ముమ్మాటికీ నిజం. అయినా నాకేదితోవ? డార్లింగ్టనుప్రభూ! మీరు నాకు మిత్రులుగా ఉంటారని ఇదివరకే చెప్పేరు. చెప్పండి నేనేమి చెయ్యాలో చెప్పండి. మీరు నాకు నిజమైన స్నేహితులని రుజువు చెయ్యండి.

డా. ప్ర:-స్త్రీ పురుషులకు మధ్య సఖ్యత ఏర్పడడం వీలుకాదు. కాంక్ష, వైరము, భక్తి, ప్రేమ వీటికి స్థానమున్న దేశాని స్నేహానికి ఎంత మాత్రమూ తావు లేదు. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నా.

విం.స:-అసంభవం, అసంభవం! (లేస్తుంది).

డా. ప్ర:- అవును, నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మీరే నాసర్వస్వమూ. మీ భర్తగారు మీకేమి తృప్తినిస్తున్నారు? ఏమీలేదు, ఈ పాడుముండకి తన దగ్గిరున్న ప్రతీ వస్తువునీ అర్పించడమేకాకుండా, దానిని మీ సంఘంలోకి లాక్కువచ్చి, మీ యింటికి తీసుకువచ్చి, మీకు తీరని అవమానం కలిగిస్తున్నాడు. నాజీవితాన్నే మీకు అర్పిస్తున్నా.

విం.స:-డార్లింగ్టన్ ప్రభూ!

డా. ప్ర:-నాజీవితం - నాజీవిత సర్వస్వాన్ని ఇదిగో తీసుకోండి, దానిని మీ యిష్టం వచ్చినట్లుగా వినియోగించండి. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నా - మరియే జీవినీ ఇంత గాఢంగా ప్రేమించలేను. మిమ్మల్ని చూచిన తరుణంనుండి ప్రేమోన్మాదంలో, ప్రేమాంధత్వం

లోపడిపోయాను. ఇంతవరకూ మీకది తెలిసియుండదు. ఇప్పుడే తెలుస్తుంది. ఈ రాత్రే ఈ యిల్లు విడిచిపెట్టి వెళ్ళిపోండి. ప్రపంచాన్ని తృణీకరించమనిగాని, లోకోపవాదానికి నవ్వమనిగాని నేను మిమ్మల్ని కోరను. మనం వాటిని గమనించవలసిందే. అవి చాలా ముఖ్యమైనవి. అసలైన, సిసలైన, సంపూర్ణమైన జీవితాన్ని గడపడమా? లేకపోతే లోకం కోరేటట్లు నటనతోకూడిన, బూటకముతోకూడిన జీవితాన్ని గడపడమా? మనం కొన్ని కొన్ని తరుణాల్లో ఎంచుకోవలసి యుంటుంది. ఆ తరుణం ఇప్పటిడాసన్నమైనది. ఎంచుకోండి. ప్రేయసీ ఎంచుకోండి.

విం.స:-(అతని దగ్గిరనుండి నింపాదిగా కదిలిపోతూ, భయంతోకూడిన దృక్కుల్ని అతనివైపుపరపి) నాకటువంటి ధైర్యం లేదు.

డా.ప్ర:-అవును; మీకా ధైర్యమున్నది. ఆరునెలలు బాధపడాలి, అపవాదుకిలోనవ్వాలి అంతే. అతని పేరుని విడిచిపెట్టి మీరు నాపేరుని ధరించిన తక్షణం అంతా సవ్యంగానే ఉంటుంది. మార్గరెట్ ఒక రోజు నాప్రేయసి, భార్యకాగలదు - అవును, నాభార్యఔతుంది! మీకు తెలుసుగా! ఇప్పటి మీస్థితి ఏమిటి? న్యాయతా మీకు చెందవలసిన స్థానాన్ని ఈ స్త్రీ ఆక్రమించింది. సిగ్గుపడకుండా, చిరునవ్వుతో ధైర్యపు దృక్కులతో యీ యిల్లు విడిచిపెట్టి వెళ్ళిపోండి. మీరలాన ఎందుకుచేసేరో లండను నగరానికంతా తెలుస్తుంది; ఎవడు మిమ్మల్ని నిందించగలడు? ఎవడూ అనలేడు. అలాగన్నపోయేదేముంది? తప్పా? తప్పంటే ఏమిటి? భార్యని విడిచిపెట్టి ఒక చెడితెతో తిరగడం తప్పుకాదూ? అలాగ అవమానపరిచే పురుషుడితో స్త్రీ కాపరం చెయ్యడం తప్పుకాదూ? ఏవిధమైన లోపాన్నీ క్షమించనని మీరిదివరకే అన్నారు. ఇప్పుడేలోపాన్నీ క్షమించకండి. ధైర్యం వహించండి. మీ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోండి.

విం.స:-నావ్యక్తిత్వాన్ని నేను నిలబెట్టుకోలేను. వేచియుండడం మంచిది. కొంతకాలం వేచియుంటాను! ఆయన మళ్లా నావారుకావచ్చు. (సోఫాలో కూలబడుతుంది)

డా.ప్ర:-అతనిని మళ్ళా మీ దగ్గిరకి రానిస్తారా? నేను మిమ్మల్ని గురించి ఏదో అనుకున్నానుకాని మీరూ తక్కిన స్త్రీలలాగే నడుచుకుంటున్నారు. లోకాపవాదానికి జంకి దేనికైనా సహిస్తారు. లోకం పొగిడినా మీకు నచ్చదు. ఒక వారం రోజుల్లో ఈ స్త్రీతో బండిలో పార్కుకి బయలుదేరతారు. మీ చిరకాలపు అతిథి, అత్యంత ఆప్తురాలై

పోతుంది. దేనికైనా సహిస్తారుగాని ఈ సంబంధాన్ని ఒక్క వేటుతో తెంపెయ్యలేరు. మీరు చెప్పింది నిజమే. మీకు ధైర్యం చాలదు, అసలే లేదు!

విం.స:-అబ్బా, ఆలోచించేందుకు నాకు కాస్త వ్యవధి ఇవ్వండి. మీకు ఇప్పుడే సమాధానం ఇవ్వలేను. (వణకుతున్న చేతిని ఫాలభాగంమీద ఉంచుతుంది.)

డా.ప్ర:-ఇప్పుడే తేలాలి, లేకపోతే ఇక యీ జన్మలో తేలదన్నమాట.

విం.స:-(సోఫానుండిలేస్తూ) అలాగైతే నేనేమీ చెయ్యను. (నిశ్శబ్దం)

డా.ప్ర:-నన్ను నిరాశలోముంచుతున్నారు! నా గుండెని పగలగొడుతున్నారు!

విం.స: నాగుండె ఇదివరకే పగిలిపోయింది. (నిశ్శబ్దం)

డా.ప్ర:-నేను రేపు ఇంగ్లండు విడిచిపెడుతున్నాను. ఇదే ఆఖరిసారి నేను నిమ్మల్ని చూడడం. మీరు ఇక మీదట నన్ను చూడలేరు. ఒక్క తృటికాలంలో మన జీవితాలు కలిసేయి – మన ఆత్మలు ఒకదానినొకటి స్పర్శించేయి. అవి మళ్లా కలవడంగాని, ముట్టుకోవడంగాని జరగదు. మార్గరెట్‌గారూ సెలవు. (వెళ్తాడు)

(సశేషము)

# అక్షరాస్యులు కావాలి!

శ్రీ పోలాకి శ్రీనివాసరావు

మనదేశంలో ఇంచుమించు నూటికి 90 పాళ్లు చదువుతెలియనివారున్నారు. కనుక చాలా విషయాలలో మనదేశం వెనుకపడివుంది. మూర్ఖదేవత మన నెత్తిని తాండవిస్తూ మూఢవిశ్వాసాలకు పురిగొలుపుతూ దారిద్ర్యాన్ని అనుభవింపజేస్తూవుంది. మన ప్రభుత్వం నిరక్షరాస్యత నిర్మూలించడానికి కంకణం కట్టుకొన్నది. బాల బాలికలకేగాక వయోజనులకున్నూ విద్యాభివృద్ధిని గలిగించడానికి పరిపూర్ణ ప్రయత్నాలు సలుపుతు నేవుంది. నిరక్షరాస్యత పూర్తిగా నిర్మూలంకావాలంటే ప్రజలయొక్క సహకారం ఎంతేని కావాలి. ఒకరికొకరం సహాయపడి ప్రభుత్వ విధానాలకు తోడ్పడినప్పుడే మనమూ, మన దేశమూ సౌభాగ్యవంతంగా తులదూగడానికి అవకాశా లేర్పడతాయి. కనుక విద్య నేర్చుకోడానికి మనం పూర్తిగా ప్రయత్న పడవలసివుంది. కాలపరిస్థితులతో బాటు మనదేశం విద్యావంతంగా వికాశించవలెనన్న అభిలాష అందరకూ జనించింది. అయినా విద్యపొందక వెనుకపడియున్న చాలామంది పాటక ప్రజలు విద్యాభివృద్ధిని గాంచడానికి యింకా ప్రయత్నాలు చేయలేదనియే చెప్పవచ్చు. బుద్ధిమంతులు దేశకల్యాణాన్నికోరి "మీరు విద్య నేర్చుకోవలసిం" దని తెలిపేటప్పుడు వారికి తామెన్నో సాకులు చెబుతూంటారు.

"మాకెందుకు చదువు? మేం ఉద్యోగాలు చేయాలా – ఊళ్ళేలాలా?" అంటారు. — మనదేశంలో ఇంగ్లీషువారు దొరతనం స్థాపించేటప్పుడు ఉద్యోగాలు చేయడానికీ, ఊళ్లేలడానికీ చదువుతెలిసినవారి అవసరం కలిగింది. ఏగ్రామంలో గాలించినా ఒకరిద్దరికంటే ఎక్కువగా చదువుకొన్నవాళ్లు లభించడంలేదు. ఆ కాలంలో దేశపరిపాలనకొరకు అవసరంగా ఆ చదువుకొన్నవారికి ఉద్యోగాలిచ్చి ఊళ్లేలుటకు గ్రామాధికారులుగా నియమించవలసివచ్చేది. అందరూ చదువుకొన్నవారైతే అందరకూ ఉద్యోగాలు లభిస్తాయా? అన్ని ఉద్యోగా లెచ్చటినుండి తీసుకరావడం? కనుక ఉద్యోగం చేయడానికి కొంతపరిమితిని నియమించారు. ఆ పరిమితి మేరకు చదవాలంటే చాలా శ్రమ, ధనవ్యయం, కాలహరణం మున్నగునవి జరుగవలసివున్నాయి. కనుక సామాన్య వృత్తులలో అలవడి వాటిలో జీవయాత్ర గడుపుతూన్న వారు యిలా చెప్పవలసి వచ్చింది.

"మాకు చదువు అచ్చుబడి లేదు" అని కొందరు చెబుతూంటారు. అచ్చుబడి కలుగక పోవచ్చు. పూర్వకాలంలో చదువులు చాలా కష్టంగా నుండేవి. అప్పటి పంతుళ్లు పిల్లలకు బండ చదువులు చెప్పేవారు. పిల్లల బుద్ధికతీతమైన ఆనాటి చదువులు వారికి చాలా కష్టమనిపించేవి. అందువలన వారు చదువులలో వెనుకపడేవారు. వాళ్ళను పంతుళ్ళు కఠినంగా శిక్షిస్తుండేవారు. కోదండాలు, గోడకుర్చీలు, ఒంటికాళ్లో నిలుచుట, గుంజిళ్ళు తీయుట, వేప చువ్వలో దెబ్బలు కాయుట మొదలైన శిక్షలకు పిల్లలు భరింపలేకుండేవారు. "మా పంతులు చచ్చునా? మాకీ పాఠశాల తప్పునా?" అని తలంచుచుండేవారు. తల్లితండ్రులకు భయపడి పాఠశాలకు వెళ్లుట తప్పేదికాదు. పాఠశాలలో తనకో తన తోడిపిల్లవానికో సంభవించే దండనలకు పిల్లవాడు భయపడి బెంగ నొందేవాడు. ఆ బెంగతో జ్వరంపొంది అపస్మారముచెంది - బడిగురించీ, పంతులుగారిని గురించి ప్రలాపించేవాడు. కొందరు పిల్లలు ప్రాణాలు సైతం విడిచిపెట్టేవారు. ఈలాంటి సంఘటనల వలన మాకు చదువు అచ్చుబడి లేదను కారణాలు కలిగాయి. ఆ కాలంలో వయోజనులకు చదువుకొనుట కభిలాష లేకున్నను, పిల్ల వాళ్లకు వలె తమకూ చదువు అచ్చుబడి కాదను మూఢవిశ్వాసాలుండేవి. ప్రజలు చదువు నేర్చుకొనుట కెన్నో సాకులు చెప్పవచ్చును. వాటిని విమర్శించు కొన్నట్లయితే తగిన కారణాలు లభిస్తునే వుంటాయి.

**ఎందుకొరకు చదువుకోవాలి? —** చదువుకొన్నవారికి చదువురానివారు లోబడి యుంటారు. చదువుకొన్నవారే మోసముజేసినా చదువురానివారు తెలుసుకోలేరు. వారు "నంది అంటే నంది - పంది అంటే పంది" అని తలలూచుతారు. వారి ప్రక్కను ధారాళంగా కూర్చోడానికి సందేహిస్తారు. చదువురానంతమాత్రాన యీలాంటి కారణాలెన్నో కలగడమేగాక దినచర్యలలో పెక్కు సంఘటనలు సంభవిస్తున్నాయి.

ఒక రహస్యమైన ఉత్తరం వచ్చిందంటే దాన్ని ఎమేష్టారుగారివద్దకో, కరణంగారివద్దకో తీసుకపోయి చదివించాలి! అందువలన ఆ జాబునందలి రహస్య విషయాలు చదివినవారికి తెల్లమవుతాయి. అప్పుడు చదువురానివాని మానమర్యాదాలకు భంగం కలిగితే వాని హృదయం చివుకుమని చింతపొందుతుందికదా!

తత్కారణంగా:— ఒక స్త్రీకి తన భర్త దూరదేశంనుండి ఉత్తరాన్ని పంపాడు. దానిని ఒకాయనచే ఆమె చదివించెను. ఆ వుత్తరంలో "నీవు రెండవ మనువుకు (మగనికి) వెళ్ల నిశ్చయించావని తెలిసింది." అని వ్రాసియుండెను. అప్పుడా యమ్మ పరితాపానికి మేరలేకుండెను. తన భర్త తనకు చూపిన అవమానానికి అగ్గిని వేసిన గుగ్గిలంలా మండిపడింది. తన భర్తగారు కలిగించిన అవమానంకంటె ఉత్తరం చదివినవానివద్ద తన మర్యాదకు భంగం వాటిల్లినదని ఆమె చాలా నొచ్చుకుంది. ఆమెకే చదువు తెలిసియుంటే యిట్టి సంఘటనాన్ని తప్పుకోనేదిగదా!

ఒకామె తన భర్తను సంతకు బంపినది. అతడు సంతకు వెళ్ళిన పిమ్మట ఆమె చెప్పిన వస్తువులలో కొన్నింటిని మరచాడు. అందువలన వాటిని జ్ఞాపకం చేసుకోడానికి డోలాయమానం చెందాడు. అంగడివాడిచ్చే సరుకులు సమంగా పొందకపోయాడు. సరకులయొక్క ధరల మొత్తాన్ని కూడికలో పొరపాటుపరిచి కొంత పైకమును అంగడివాడు కాజేశాడు. ఆనాడా గృహస్థునకు కొంత నష్టం కలిగింది. ఇంటికివచ్చిన పిమ్మట పరిహాసాల పాలయ్యాడు. అతనికే చదువుతెలిసియుంటే ఒక చీటీపై వ్రాసుకొని వస్తువులనన్నింటిని కొనవలసినవాడే! తప్పు అంకెల మొత్తం, తప్పు తూనికలు మొదలైనవి తెలుసుకునేవాడు. ఇట్టి సంఘటనలెన్నో దినచర్యలలో కలుగుతూంటాయి. అత్యల్పమైన విషయం మొదలు అత్యధికమైన విషయంవరకు చదువు చాలా ముఖ్యమైంది. కనుక చదువుయొక్క ఉపయోగం వర్ణించుట మనకు సాధ్యంకాదు.

మన నిత్యావసరాలలో చిన్న చిన్న సంఘటనలకు సైతం అవసరమైంది గనుక చదువు నేర్చుకొని తీరాలి! మనం మాట్లాడు భాష తెలుగుభాష. మన తెలుగు భాషలోనున్న రామాయణ భాగవతాది పురాణాలు, గ్రంథాలు మున్నగునవి 56 అక్షరాలూ, వాటిలో పుట్టిన గుణితంతోనే ఉన్నవి. మనకు కొంతభాష తెలియుచు, కొంత జ్ఞానాన్ని ఆర్జించియున్నాము. అయినా 56 అక్షరాలను నేర్చుకొనకుండుటవలన చదువను వ్రాయను రాకున్నది. అందువలన చదువురానివారమని లోకంలో, సంఘములోను నిందింపబడుతున్నాం. మనం అక్షరజ్ఞానం పొందాలంటే దినానికి ఒక గంట వంతున 60 దినాలు వెచ్చిస్తే చాలు. 60 దినాలలో వెచ్చించే 60 గంటలకాలం, అయిదు పగటిపూటల పరిమితిని వెచ్చింపకపోవడం చాలా నవ్వులపాలు. కనుక మనం సక్రమంగా బుద్ధిని వినియోగించి అక్షర జ్ఞానం పొందడానికి ప్రయత్నాలు చేయాలి!

"మన మనేక వృత్తులలో చిక్కుకొన్నాం, చదువుకోడాని కవకాశంలేదు" అనవచ్చు. — మనం దినమంతా పనిచేసినప్పటికి రాత్రికాలంలో తీరిక లభిస్తుంది. రాత్రిపూటలో ఒక గంటకాలం వినియోగించగలం. పగటిపూటయందును కొందరకు తీరిక లభించవచ్చు. పశువుల కాపరి పశువులను మేపుతూ పచ్చిక బయలలో ఏదేని పుస్తకం చదువుకోగలడు. సేద్యగాడు తీరిక

గలప్పుడు కళ్ళంలో చదువుకోగలడు. ప్రయత్నించే పక్షంలో ఎంతేని అవకాశం లభిస్తుంది.

**"60 దినాలలో 60 గంటలలో చదువు ఎలా వస్తుంది ?"** అను సంకోచం జనించవచ్చు. — మనం కొన్ని తేలిక పనులు, కొన్ని కష్టమైన పనులు చేయవలసినపుడు అన్నీ కలిపి క్రమంలేకుండా చేయడానికి ప్రయత్నిస్తే ఏవీ పూర్తిచేయలేం. మొదట తేలిక కార్యాలు ప్రారంభిస్తే వాటిని పూర్తి చేయగలం. పిమ్మట కష్టమైనవాటిని పూర్తిచేయడానికి అవకాశాలుంటాయి. ఇట్లే మన తెలుగు భాష 56 అక్షరాలలో కొన్ని తేలికయైనవి కొన్ని కఠినమైనవి ఉన్నాయి. వాటిని విభజించినపుడు కొన్ని తేలికయైన అక్షరాలు లభిస్తాయి. వాటితో మొట్టమొదట వొక్కొక్కటిగా చదువను వ్రాయను ప్రారంభించి, పిమ్మట కష్టమైనవాటిని ప్రారంభిస్తుంటే తేలికగా శీఘ్రకాలంలో అక్షరాభ్యాసం చేయవచ్చు.

అక్షరాలూ వాటి గుణితం, ఒక్కొక్క అక్షర పాఠం ఒక్కొక్క దినం వంతున నేర్చుకొన్నా మనం అంచనాచేసిన 60 దినాలలో పూర్తిచేయవచ్చు. విశేష విజ్ఞానాన్ని పొందాలంటే పరిమితి చెప్పజాలం గానీ క్షుణ్ణంగా వ్రాయడానికి చదవడానికి 60 దినాలు చాలు.

సులభంగా శీఘ్రకాలములో చదువు నేర్చుకోడానికి నేటి విద్యావంతులు విధానాలు సిద్ధపరిచారు. వాటిలో పూర్వకాలం రీతిగా ఓనామాలు, గుణితం బట్టీగా వ్రాయించి చదివించలేను. అలా చెప్పకుంటే చదువురాదు అనుమూఢ విశ్వాసం పొందనక్కర లేదు. "అ ఆ ఇ ఈ" అను నాలుగక్షరాలు నేర్చుకోడానికి చాలా విసుగు, కాలయాపనం కలిగేది. నేడు నాలుగక్షరాలు నేర్చుకోడంలో పెక్కు మాటలు, వాక్యాలు తెలుసుకొనడమే కాకుండా చదువు సరదాగా సాగుతుంది. కనుక సందేహం విడిచి క్రొత్త పోకడల్లో చదువుకోవాలి!

పురుషుడికి ఎంతజ్ఞాన మవసరమో స్త్రీకిని అంత జ్ఞానమవసరం. ఆమె చాలా కార్యాల్లో పురుషునకు తోడ్పడవలసివుంది. తన సంసారాన్ని పొదుపుగా జరుపుకోవాలి! ఇంటిపనుల్లో మెళకువగా మెలగాలి! తన కుటుంబాన్ని సుఖవంతంగా సంరక్షించుకోవాలి! తన బిడ్డలను ఆరోగ్యవంతులుగాను, గొప్పవారిగాను తయారుచేసుకోవాలి! ఎన్నో విషయాలు సవరించుకోవాలి! కనుక పురుషులకువలెనే స్త్రీలకు సైతం విద్య చాలా అవసరం.

**మనకు చదువు నేర్పువారెవరు?**

మనమే శ్రద్ధగా ఇతరులను అర్థించి నేర్చుకోవాలి! మనలో చదువుకొనినవారు చదువురానివారికి నేర్పవచ్చునుగదా! అట్లే స్త్రీ పురుషులు, బాల బాలికలు అను తారతమ్యములు లేకుండా అందరూ విద్య నేర్చుకొన్నప్పుడే సౌఖ్యప్రదంగా జీవయాత్ర గడపగలం. ఆనాడే దేశకల్యాణం ప్రాప్తిస్తుంది. కనుక అక్షరాస్యతకొరకు ప్రయత్నించాలి! అక్షరాస్యులు కావాలి!



*

# నెప్పితో అవస్థనా?

# "నోపెయిన్"

[illegible]

## ఒక కలకత్తా కెమికల్ తయారింపు

మద్రాసు ఆఫీసు : 8/149 బ్రాడ్వే, మద్రాసు 1.

# నారీహృదయము

శ్రీమతి ఎస్. దుర్గా కుమారి

ఉమాదేవి ప్రసాదులకు మహావైభవంగా వివాహముచేశారు; కాని వారిద్దరి స్వభావాలువేరు. ఎండ వానలకున్నంత వ్యత్యాసాలు వున్నాయి. ప్రసాదు నవనాగరీక యువకుడు. ఉమ ప్రాచీన సాంప్రదాయిని. అలాంటప్పుడు వారిద్దరిమధ్య ప్రేమ కుదరడమెలాగు? ప్రసాదు హృదయములో ఉమకు స్థానమేలేదు. పోనుపోను ఆమె ముఖము చూడడానికికూడ యిష్టపడడములేదు. పెండ్లయిన కొత్తలో ఉమ భర్తకు చాల ప్రీతితో భోజన ఫలహారములు తెచ్చి పెడుతూవుండేది. కాని యిప్పుడామెను ప్రసాదు దగ్గరకు కూడ రానివ్వడములేదు. ఏదయినా కావలసి వుంటే వేరేవాండ్లచేత తెప్పించుకోసాగాడు.

ప్రసాదు ధనవంతుని బిడ్డ. తండ్రి దుర్గాదాసు, గుడ్డలు మిల్లు యజమాని. లక్షలాధికారి. ఆయన ఏకమాత్ర సంతానము ప్రసాదు. తల్లి చిన్నతనంలోనే చనిపోయింది. అప్పటినుండి పనివాండ్లచేతుల్లో పెరిగాడు. చిన్నతనంనుండి తక్కువ వాతావరణములో పెరిగినందున ప్రసాదుకు చెడ్డ అలవాట్లు ఎక్కువగా ఏర్పడ్డాయి. సంవత్సరాలు పైబడి యవ్వనము దాపురించి స్వతంత్రుడయినకొద్దీ మరీ నీచకార్యాలకు గురయ్యాడు. సారాయి త్రాగకుండా ఒక్క నిమిషం వుండలేడు. మాంసాహారము ముఖ్యావసరము. ప్రసాదు భవిష్యత్తు తెలుసుకోలేకుండా పతనము కావడానికి ముందడుగు వేస్తున్నాడు.

దుర్గాదాసు కొడుకును మంచిమార్గములో వుంచడానికి విశ్వప్రయత్నములు చేశాడు. కాని అతడు బాగుపడాలని లేదు. బాగుపడనూలేదు. అతడి అసభ్య దురాచారవ్యవహారాలతో దుర్గాదాస్ గారి మంచి పేరుకు మచ్చ ఏర్పడింది. వూరి ప్రజలంతా, "దుర్గా దాసుగారి కుమారుడీయనేనా? సాయంత్రమయితే వేశ్యలిండ్ల ముందు తిరుగుతూ వుంటాడు. ఒక రోజు తప్పత్రాగి మురికికాలువ గట్టున పడివుంటే కళ్లారచూచాము" అని అనుకోసాగారు.

కొన్నాళ్లకు దుర్గాదాసు వ్యాధిగ్రస్తుడయి హఠాత్తుగా చనిపోయాడు. ఆయన మృతినిగురించి ప్రసాద్‌కు లేశమాత్రం కూడ కష్టము కలుగలేదు. వున్న కొద్ది అడ్డంకుకూడ తొలగి పోయింది. ఇప్పుడు అవసరమొచ్చినప్పుడు మాట అనడానికి కూడ ఎవ్వరూలేరు. నిత్యము సారాత్రాగి

బాహాటంగా వేశ్యలిండ్లలో నృత్యాలకు పోవడము మొదలు పెట్టాడు.

ఉమ ఇంటిలోనుండి అంతా గమనిస్తూ ఏమీ అనలేక మనసును సందలించుకొని లోలోపలనే కృశిస్తూవుంది. ఒకవేళ ఏదయినా అంటే కొట్టి బాధపెట్టేవాడు. ప్రసాదు యిప్పుడు యింటిలో వుండడమే లేదు. ఎక్కువదినాలు బయటనే తిరుగుతూ వుండేవాడు. ఎప్పుడయినా యింటికివస్తే బయట వరండాలో మిత్రులతో కలసి మజాచేసి, వారితోనే లేచి వెళ్లిపోయే వాడు. ఉమ భర్తను కండ్లతో చూడ డానికికూడ అవకాశము దొరకడములేదు.

ఒకనాటిరాత్రి పదిగంటలప్పుడు ఉమ తనగదిలో ఒంటరిగా కూర్చొని రామా యణము చదువుతూవుంది. గది తలుపు కదలించిన చప్పుడయింది. ఆదుర్దాగా వచ్చి తలుపుతీసి చూచింది. ప్రసాదు ఎదు రుగా నిల్చొని వున్నాడు. ఆమెకు భర్తను చూచి అమిత ఆశ్చర్యమేసింది. తలుపు తీయడమే తడవుగా ప్రసాదు త్వరత్వరగా లోపలకు పోయి మంచము మీద పడి పోయాడు. తలవని తలంపుగా యింటికి వచ్చిన భర్తకు వుపచర్య చేయాలనే సంతోషముతో ఉమ దగ్గరకు పోయి కూర్చొని శరీరమంతా పరిశీలించింది. ఆయన ముఖము, కండ్లు ఎర్రగా మారి వున్నాయి. తలపైన బలమయిన గాయాలు కనుపించాయి. 'ఎవరో దుర్మార్గులు త్రాగించి ఈ పని చేసివుంటారు' అని మన సులో చింతిస్తూ, పతిముఖాన కారుతూ వుండే రక్తాన్నంతా తుడిచి గాయాలకు పట్టీలు అతికించింది. లేకలేక పతిసేవ చేయడానికి అవకాశము దొరకినందుకు ఆమె హృదయమిప్పుడెంతో ప్రశాంతంగా వుంది. తెలిసుసి దెబ్బలు బాధకు ప్రసాదు మూల్గుతూ, వళ్లు తెలియకుండనే నోటనుండి "దుర్మార్గము–నటన–వంచన" అని మాటలు వస్తున్నాయి. మత్తులో యింకేమి చెప్పేది తెలియడములేదు. దాదాపురాత్రి మూడుగంటలప్పటికి బాగ నిద్రపట్టింది. ఉమ మాత్రము రాత్రంతా నిద్రపోకుండా ఆయన ప్రక్కనే కూర్చొని వుపచర్యలు చేస్తూవుంది.

సూర్యోదయము కాగానే ప్రసాదుకు మెలుకువ వచ్చింది. అప్పటికి త్రాగిన మత్తు పూర్తిగ తగ్గిపోయింది. కండ్లు తెరచిచూచాడు. ఉమ కాళ్ల దగ్గర తల వంచుకొని కూర్చొనివుంది. భర్తలేచి కూర్చోగానే ఉమ దరిద్రునికి రత్నము దొరకిన విధంగా సంతోషములో పొంగి పోయింది.

ప్రసాదు కొంత తడవు తలవంచుకొని ఉమనుచూచి మెల్లిగ "నేనిప్పుడు మారి పోయాను ఉమా! ఇకనీవు కష్టపడవద్దు, నీవు నా హృదయరాణివి" అని అన్నాడు

ఉమ మనసులో ఏనాటినుండో పేరుకొని వున్న దుఃఖబాధ అంతా ఒక్కసారిగ మా పోయి ఆనందముతో శరీరమంతా వుప్పొంగి పోయింది. చిరునవ్వుతో "మీరు నా కష్టాన్ని గురించి అనుకోకండి." అని చెప్పి కాఫీ తెచ్చియిచ్చింది.

ప్రసాదు ఇప్పుడు పూర్వంలాంటివాడు కాడు ఆయన జీవితములో గొప్ప పరివర్తన కలిగింది సారాయి త్రాగడము మానివేశాడు. వేశ్యల బజారుకయినా పోని పట్టు వేసుకొన్నాడు. ఉమ ఆనందానికి అంతులేదు. ప్రసాదు బుద్ధిహీనతకారణంగా ఆమె ఎన్నో కష్టాలు సహించింది. ఒకప్పుడు భవిష్యత్తు అంధకారంగా కనుపించింది. సుఖస్వప్నాలు నిరాశా ముద్రములో మునిగిపోయాయి. హృదయవీణ తంత్రులు తెగిపోయినవి. కాని ఇప్పుడు ప్రసాదు జీవితమార్పుతోటి ఉమజీవితము ప్రసన్నమయి హాయిగొలిపింది. ముడుచుకపోయిన హృదయ పుష్పము మరల వికసించింది. ప్రసాదు తనరూములో కూర్చొని అలమారులన్నీ సర్దుకొంటూ అందులో వున్న సారా సీసాలు, మాంసముప్లేట్లు యితర అసభ్య వస్తువులన్నీ తీసి పారవేశాడు. యిప్పుడాయనకు వాటితో పనిలేదు. ఇంతలో ఆయన పాతస్నేహితులు మదన మోహన్ ఇంకా కొంతమంది లోనికివచ్చారు. ప్రసాదు వారికి స్వాగతమిచ్చాడు.

"ఏమండోయ్! ఈ మధ్య కనుపించడమే లేదు. రెండువారాలునుండి నీదర్శనమే కష్టంగావుంది" అంటూ మోహన్ ప్రసాదుదగ్గరగా కూర్చొన్నాడు. మరొక స్నేహితుడు – "కనుపించకపోవడమేమిటి? నాలుగుప్రక్కలు సారాసీసాలు పెట్టుకొని ఇంటిలో ఒంటిగా కూర్చొని మజాచేస్తూ వుండి వుంటాడు. ఏకాంతంలో త్రాగడము అలవాటుపడితే యింకెవరికయినా యిప్పించవలసిన అవసరము తప్పిపోతుంది. అదికాక పదుగురికి తెలియకుండా కూడ వుంటుం"దని అన్నాడు.

పసాదు కొంతసేపు వారితో కులాసా మాటలు మాట్లాడి "నేను ఆదురలవాట్లన్నీ ఇప్పుడు మానుకొన్నాను. యింకెప్పుడూ అలాంటి అసహ్యాపనులు చేయ తలచుకోలేదని" గట్టిగా చెప్పాడు.

"మీకు తెలియదు ఇదంతా వదెన గారి బలవంత పట్టుదలవలన జరిగివుంటుంది. రెండో విషయములోకూడ ఆ ప్రభావమే ప్రాకివుంటుంది. నిజంగా వేశ్యలు స్వార్థ జీవులు. ఎంత త్రాగించి తినుపించినా జేబు ఖాళీ అయ్యేసరికి మెడబట్టి బయటకు దాటమంటారు. నేనారోజు సమయానికి దానింటి ముందుకు పోకుండావుంటే ప్రసాదు ఈపాటికి ప్రాణాలుతో వుండేవాడు కాదు అయినా అవన్నీ మనములెక్క చేయవలసినివికాదు. వదెనగారి దగ్గర మనమిప్పుడు

అనుమతి తీసికొందాము'' అని రాధాశ్యాముడు నవ్వుతూ అన్నాడు. అంతావిని ప్రసాదు వారితో – ''ఇంతకు యిప్పుడు మీకేమి కావాలి ? '' అన్నాడు.

''యింకేముంది కొంచము త్రాగడానికి దానికితోడు . . '' అని గోపాలు మోహన్ భుజము నానుకొన్నాడు. ప్రసాదు కాదన లేక నౌకరును పిలిచి కావలసిన సామగ్రి తెప్పించియిచ్చాడు ; కాని ఆయన ఏది కూడా ముట్టనేలేదు.

మోహాన ప్రసాదుకు ఆంతరంగిక మిత్రుడు. ఆయనకు మోహన్ మీద అందరికంటే ఎక్కువ ప్రేమ. అందరూ వెళ్లిపోయిన తరువాత మోహానుతో —''నేను నిన్నొక సలహా అడుగుతాను. దానిలో నాకు నీపూర్తి సహాయము కావలసివస్తుంది'' అని చెప్పాడు.

''ఆ. ఆ, ఎందుకు చేయను ! ''

''చాల సంవత్సరాలనుండి నేను త్రాగి ఈ విధంగా తిరుగుతూ వున్న విషయము నీకు తెలుసుకదా ? అందువలన మిల్లుపను లన్నీ చెడిపోయి ఆగిపోయినవి. వ్యాపారము జరగడము కష్టంగా వుంది. మిల్లు త్వరలోనే దివాలా తీస్తుందని లోకులంతా అనుకొంటున్నారు. ఇప్పుడయినా అది చక్కబరచుకోలేకపోతే అంతా నాశన మయిపోతుంది. అందుకు ఇప్పుడేమి చేయాలో తెలియడములేదు'' అని చెప్పాడు ప్రసాదు.

''అందుకు ఒక మంచి మార్గముంది. మనముకొంతమంది వ్యాపారులకు ఆ సర్లకు ఒక మంచి 'టీ' పార్టీ యిద్దాము. దానివల్ల నీకు చాలమేలు కలుగుతుంది. ఆఫీసర్లకు లంచాలిచ్చి మిల్లు పేరు గొప్పగా చెప్పుకొనేలాగు చేస్తాము'' అని మోహన్ వుపాయము చెప్పాడు.

కర్తవ్యమేమిటో తెలియకుండా నున్న ప్రసాదుకు ఆ మాటలువిని ముఖములో ఒక విధమయిన సంతోషము కన్పించింది. ''మోహన్ యివన్నీ నాకేమీ తెలియవు ఆ పనికి కావలసిన కార్యమంతా నీవే సాగించవలసింద''ని చెప్పాడు.

''నేను రేపే అందుకు కావలసిన ప్రయత్నాలన్ని చేస్తాను'' అని చెప్పి మోహన్ లేచి వెళ్లిపోయాడు.

మోహాను పన్నిన పన్నాగములో ప్రసాదు చిక్కుకొన్నందుకు రాధాశ్యాముడు చాలసంతోషపడ్డాడు. మోహన్‌కు ధన్యవాదాలర్పించి ''ముఖ్యముగా రెండుపనులు చేయించు–అంగడి వాడితో చెప్పి సారాయి అధికముగా తయారులో వుంచడము, చంద్రకాంతాన్ని మన స్వాధీనములో వుండమనడము అవసరము. మన వుపాయము ఇందులో ఫలిస్తే ఇక ముందు మన జీవితాలు సాఫీగా పుకోవచ్చును. తరువాత విషయాలతో మనకవసరములేదు'' అన్నాడు.

'టీ' పార్టీ ఏర్పాటు చేశారు.

ప్రసాదుభవనమంతా పెండ్లి పందిరిలా గుందా రోజు. సరిగ్గా ఎనిమిది గంటలు కల్లా విందు ఆరంభమయింది. సామాను లన్నీ చాలా గొప్పగా ఏర్పాటయ్యాయి. లెక్కలేనంత డబ్బు వ్యయంతో ఎవ్వరికి కొదవలేకుండా జరిగిపోయింది. అందరూ ప్రసాదుకు నమస్కారాలు చెప్పి వెళ్లి పోయారు.

ప్రసాదు చంద్రకాంతం, కొంతమంది మిత్రులు మాత్రం మిగిలివున్నారు. మేజా మీద ఫలహారములుతోటి మద్యపానము కూడా వుంది. అందరు మత్తుగావున్నారు. ప్రసాదుకూడ తప్పత్రాగి స్వాధీనములో లేకుండా వున్నాడు. మరల పాత అల వాట్లకు లోనయ్యాడు. చంద్రకాంత ప్రసాదుముందు కూర్చొని కూనిరాగాలతో పాడుతూవుంది. అందులో వక్కరుకూడా స్వాధీనములోలేరు. అదునుచూచి చంద్ర కాంత ప్రసాదు వున్న సోఫాలో కూర్చొన్నది. పార్టీ అయిపోయిన గంటకు కూడ ప్రసాదుపైకి రాకపోవడముచూచి ఉమ మెల్లిగా మెట్లుదిగి పెద్దహాలు ద్వారముదగ్గరకు వచ్చి చూచింది. అంతా గందరగోళంగావుంది. ఆమెకు శరీర మంతా చమటలు పోశాయి. శ్వాసగతి అధికమయింది. హృదయము వేగంగా కొట్టుకోసాగింది. ఆవేశములో హాలులోకి పోయి సీసాలు పగులగొట్టి ఆ గూండాలను చెవులుపట్టుకొని బయటకు పంపుదామని మనసులో అనుకొంది. కాని త్రాగి మత్తెక్కి వున్న దుర్మార్గులు ఏమయినా............

ఇంతలో చంద్రకాంత ప్రసాదుపైన చేయివేసి ఆనుకొంది. ప్రసాదు ముగ్ధుడయి దానిని తన ఆలింగనములో బంధించి వేసుకొన్నాడు. అది చూచి ఉమ అసహ్య ముతో సహించలేక పోయింది. వున్మాదా వస్థలో మతిచెడి తలను గదిద్వారముకు గట్టిగా కొట్టుకుంది. ఒక్క దెబ్బతో తల పగిలింది. శబ్దమువిని ప్రసాదు తెలివి తెచ్చుకొని ఆతురతగా వెనక్కుచూ చాడు. హాలుద్వారము దగ్గర ఉమ పడి వుంది. భయపడి తొందరగా సమీపానికి పోయి నాడిచూచాడు. చాల నీరసంగా వుంది. జీవించడమే దుర్లభమనిపించి, ప్రసాదు నౌకరు సహాయముతో ఆమెను గదిలోనికి తీసుకొనిపోయి నౌకరును డాక్టరు కొరకు పంపించాడు.

ఇంతలో ఉమ కండ్లు తెరచి ప్రసాదు చేయి పట్టుకొని మెల్లగ "డాక్టరు వద్దు. ఇక ఎవ్వరితో అవసరమేలేదు" అంటూ మాట్లాడలేక కండ్లు మూసింది.

ప్రసాదు మిత్రులంతా ఈ సంఘటన చూచి ఇండ్లకు పరుగెత్తారు. ప్రసాదును

నాలుగు ప్రక్కలు అంధకారము క్రమ్ముకొంది. మరల చేసిన తప్పిదాన్ని గ్రహించుకొన్నాడు. పెద్ద రోదనతో ఉమపాదాలు పైబడి విలపించాడు – "నేను పాపిని మహాపాపంచేశాను. మరెప్పుడూ ఆ విధంగా చేయను. నీవు దేవతవు నన్ను క్షమించు" అంటూ స్పృహతప్పి ఉమ పాదాలుమీద పడిపోయాడు.



# దీక్ష

శ్రీ బులుసు వేంకటరమణయ్య

[ప్రవేశము : పెద్దిభట్టు - పడకటింటిలో]

పెద్ది:-(తనలో) నేను మొదట్నుంచీ అనుకుంటూనే వున్నాను, నాభార్య సామాన్యమైన ఘటం కాదని. ఆమె భర్తనని చెప్పుకోడానికి నాకు చాలా సిగ్గనిపిస్తుంది. ఏమంటే - ఆమె చదువుల సరస్వతి. నేనో వ్యవసాయదారుణ్ణి. చదువుకీ నాకూ సగం ఎరుక! యీ శోభన పునస్సంధానం జరిగినప్పుడు - ఏదో బడాయిగా మూడు రాత్రులూ గడపాను, మహావిద్వాంసుడిలాగ నటిస్తూ. ఇప్పుడీగండం ఎలా తప్పుతుందో తెలియదు. 'నేను అత్తారింటికి వెళ్లనోయి, బాబూ?' అని ఎంత గోలపెట్టినా మావాళ్లు బలవంతాన ఋక్కడికి నెట్టారు. శుభమల్లే పండుక్కి పిలుస్తే వెళ్లకపోవడం మర్యాదా కాదన్నారు. (నిట్టూర్పు విడిచి) తీరా వచ్చాక ఏమనుకుంటే ఏమిలాభం? ఎలాగో దమాయించి యీ మూడురోజులూ గడపాలి! (ఇటు అటు చూచి) ఆమె వచ్చేవేళ అయినట్టుంది. ఏదో గ్రంథకాలక్షేపం చేస్తున్నట్టు నటించాలి (అంటూ అక్కడున్న ఉత్తర రామచరిత్ర నాటకాన్నితీసి పుటలు తిరగవేస్తూ వుంటాడు.)

[ప్రవేశము : పెద్దిభట్టుభార్య కల్పలత]

కల్ప:-నమోభవద్భ్యః. అపికుశలం?

పెద్ది:-(తెల్లబోయిచూస్తూ పుస్తకమమూసి) అలా నిలుస్తావేమి? చాపమీదకూచో.

కల్ప:-(చిన్నపుచ్చుకుని) యథాజ్ఞాపయన్తి భవంతః. (అని చాపమీద కూర్చుండును.)

పెద్ది:-(పుస్తకముతెరచి చూచుచుండును.)

కల్ప:-ఓహో! ఉత్తరరామచరిత్ర చూస్తున్నారా? నేను యేమిటోచక యీవాళే ఆగ్రంథాన్ని తీసేను. అక్కడక్కడ కొన్ని సందేహాలు కలుగుతూవున్నాయందులో. మిమ్మల్ని అడుగుదామనే అనుకుంటున్నానిప్పుడు.

పెద్ది:-నీక్కూడా సందేహాలున్నాయంటావా?

కల్ప:-కావలసినన్ని. అయినా నాకు వచ్చిన చదువు ఏమాత్రం గనక? ముఖ్యంగా ఒక శ్లోకంలో ఒక్క సందేహం కలిగింది. (నవ్వుతూ) ఆ సందేహాన్ని తీరుస్తారనుకుంటాను మీరు!

పెద్ది:-ఏమడుగుతావో అడుగు - చూదాం.

కల్ప:-అందులో మొదటి అంకంలోనే - చిత్రపట దర్శన వృత్తాంతంలో – రాముడు తన వనవాసపు అనుభవాల్ని సీతకు తెలియజేస్తూవున్న సందర్భంలో (నవ్వుతూ)

'కిమపి కిమపి మందం మందమాసక్తి యోగా
దవిరళిత కపోలం జల్పతో రక్రమేణ
అ శిథిలపరిరంభ వ్యాపృతైకైకదోష్ణో
రవిదిత గతయామా రాత్రిరేవ వ్యరంసీత్.' *

అనే శ్లోకం వుందికదా! దాని చివరిపాదంలో 'రాత్రి రేవ వ్యరంసీత్' అనే దానికి బదులు '♦ రాత్రి రేవం వ్యరంసీత్' అనిన్నీ పాఠం వుందట! ఇందులో ఏపాఠం మేలో, దాని అభిప్రాయం యేమిటో తెలుపాలని కోరుతున్నాను.

---

* 'ఒకరి కౌగిలిని ఒకరు విడవకుండా గట్టిగా బాహువులను పెనవేసుకుని, కపోలాలు దగ్గిరసా చేర్చి ఎక్కువ ఆప్యాయంతో మెల్లిమెల్లిగా, ఏవో లోకాభిరామాయణాలు తెంపులేకుండా చెప్పుకుంటూ వుంటే రాత్రి గడిచిపోయినట్లే తెలిసేదికాదు. ప్రసంగాలు మాత్రం ముగియలేదు' అని భావము.

♦ 'రాత్రిరేవం వ్యరంసీత్' అనేచోట 'రాత్రియిలా గడిచిం'దని అభిప్రాయం.

పెద్ది:-(ఆలోచన నటిస్తూ) నీ ప్రశ్న యేమిటో కాస్త వివరంగా చెప్పరాదూ?

కల్ప:-ఇంతకన్నా వివరం ఏమిటి? ఈ రెండిట్లోనూ ఏ పాఠం సరియైనదో, ఎంచేతో చెప్పండి.

పెద్ది:-చదువుకున్న దానివి నీకు ఆ మాత్రం తెలియకే నన్నడుగుతున్నావా? నీకు ఏది బాగుందో అదే తీసుకో! ఇంతకీ యీ శ్లోకాలంటేనే నాకు తలనొప్పి! సుఖంగా పడుకోక ఎందు కొచ్చినగోల యిది!

కల్ప:-(తనలో) నేననుమానించింది నిశ్చయం అయినది. ఈయనకి విద్యాగంధం వున్నట్టులేదు. అయినా మరోసారి కదిపిచూస్తాను. (ప్రకాశంగా) తమరు * పండిత పుత్రులు! తమకు తెలియని వుంటాయా? అని అడిగేను. చికాకుగా వుంటే శ్రమ అక్కర్లేదు.

పెద్ది:-అది గదీ! అలాగ దారిలోకి రా. నడిచి రావడంనుంచి చాలా శ్రమగా వుంది. నిద్రవస్తున్నాది (పరుండును.)

కల్ప:-(నిట్టూర్చి) ♦ పాలాశ కుసుమం! పాలాశ కుసుమం! ఇలాంటివారని నేను ఎప్పుడూ అనుకోలేదు. ఇంతకీ నా అదృష్టం!

౨

[ప్రవేశము : పెద్దిభట్టుమిత్రులు కామశాస్త్రి, రామసోమయాజులును – వీధిలో నడుచుచు.]

రామ:-ఏమోయి శాస్త్రీ! మన పెద్దిభట్లు రెండు రోజుల్నించీ కనబడడంలేదేమీ?

కామ:-పండుక్కి అత్తారింటికి వెళ్లాడంటూ వాళ్ల నాన్న పేరుభట్టుగారు చెప్పారు. బహుశా యివ్వాళ రావచ్చు.

రామ:-అత్తారింటికివెళ్తే కొంచెం చిక్కున్నమాట! అతని భార్యా బాగా చదువుకున్నదట! బ మరుదులూ దిట్టమైన పండితులట! మనవా వాళ్ళదగ్గిర తెల్లమొగం వెయ్యవలిసిందేగదా చిన్నబోయి వస్తాడోయేమో! ఇంతకీ మనవా చదువుకున్నపిల్లని పెళ్లిచెయ్యడం పేరుభట్లుగా పొరపాటే సుమీ!

కామ:-అప్పుడేం తెలుస్తుందీ! ఆయన మనవా షష్ఠాలుగోయేట 'అష్టవర్షా భవేత్కన్యా' అ శాస్త్రాన్ని అతిక్రమించకుండా ఆ అమ్మాయి పెళ్లిచేశాడు. మనవాడికి చదువు అబ్బలేద ఆ అమ్మాయి బాగా చదువుకుంది. ఇలా అ తుందని అప్పుడెవరికి తెలుసునేమిటి?

[ప్రవేశము : పెద్దిభట్టు]

రామ:-నీకు నూరేళ్ళాయుష్యం భట్టూ! నీ సంగ అనుకుంటున్నాం. ఎప్పుడేమిటి రావడం అత్తా రింటినుంచి?

పెద్ది:-పొద్దున్నే వచ్చేనోయ్ యాజులూ! ఏం మీరంతా కులాసానా? విశేషాలేమిటి?

రామ:-అత్తారింటికెళ్లి వచ్చిన నువ్వు ▪ శేషా ల చెప్పాలిగాని యిక్కడేమిటుంటాయి, యీ రెండ రోజులకీ!

కామ:-అత్తారింట్లో హాయిగా గడిపావనుకుంటాను

పెద్ది:-చాలా క్షేమంగావుంది.

రామ:-బహుమానాలేమయినా తగిలాయా లేదా!

పెద్ది:-ఇవ్వకేమీ? సరిగంచు ధోవతులూ అ యిచ్చారు.

రామ:-(నవ్వుతూ) అది కాదయ్యా నేనడిగేది. నీ భార్యా, బావమరుదులూ బాగా చదువుకున్న వాళ్లుగదా, నీకు చదువురాదని యేమన్నా ఆక్షే పించారా యేమిటని నా ప్రశ్న..

---

* పండిత పుత్రుడు = విద్యా విహీనుడు.

♦ పాలాశ కుసుమము = మోదుగుపువ్వు. నిర్గంధ కుసుమమన్నమాట.

పెద్ది:—బాగుంది నువ్వనేది! నేను మాటల్లో గట్టి వాడనని నీకు తెలియదూ? ఏదన్నా చదువు గురించివస్తే మాటలు మార్చివేసి, వాళ్ళనే బోల్తా కొట్టించేవాడిని.

కామ:—అయితే చికాకులేమీ రాలేదన్నమాట!

రామ:—నిన్ను బాగా మెచ్చుకున్నారన్నమాట!

పెద్ది:—మెచ్చుకోకేమి? బాగా మెచ్చుకున్నారు. నాభార్యా వాళ్ళతో నన్ను గురించి బాగా చెప్పింది. నేను పండిత పుత్రుడననీ, పాలాశ కుసుమంవంటివాడననిన్నీ.

కామ:—(ఆశ్చర్యంతో) నిజంగా అలాగనే అన్నదా? నీకు బాగా జ్ఞాపకంవుందా?

పెద్ది:—నాకు బాగా జ్ఞాపకంవుంది. నేను పాలాశ కుసుమంలాంటివాడనంటూ రెండు, మూడుసార్లు పొగడింది.

రామ:—(విరగబడి నవ్వుతూ) ఓరి పిచ్చిభట్టూ! అది నిన్ను పొగడడం కాదోయి! పండిత పుత్రుడంటే కుంత అని అర్థం! పాలాశకుసుమం అంటే నిర్గంధ కుసుమం! మోదుగుపువ్వు చూడడానికి అందంగా వుంటుందేకాని వాసనవుండదు. అలాగే నువ్వూమనిషివైతే పుష్టిగా వున్నావుగాని చదువు శూన్యం అని అర్థం! ఇది తెలుసుకోలేక- ఏదో నిన్ను మహాపొగడినట్లు సంతోషిస్తున్నావు!

పెద్ది:—నిజంగా ఆ మాటలకి యింత అర్థం వుందేమిటి? నాకు తెలియలేదు. (కోపము)

కామ:—ఎంత దారుణం! ఆడది ఎంత చదువుకున్నా భర్తని యిలా అనడం భావ్యంకాదు.

పెద్ది:—(కోపంతో) తెలిసింది. నాభార్య స్వభావం- దీనితో బాగా బోధపడింది. నేను గ్రహించలేనని ఏవో వంకరమాటలు ప్రేలి నన్నవమానించింది కదూ! ఆ మాటలే ఆమెకి తిరిగి అప్పగించి తీరతాను చూడండి! ఈ రోజే కాశీకి బయలు దేరి విద్యలన్నీ నేర్చుకుని వస్తాను. వచ్చి-ఆ విడకి ఆ మాటలు అప్పగించి తీరతాను. అంతదాకా దీక్షపట్టి యీ గెడ్డాలూ, మీసాలూ పెంచుతాను. ప్రతిజ్ఞ నెరవేరితేగాని వాటిని గొరిగించను.

కామ:—నువ్వు అంతపనీ చెయ్యగలవు.

రామ:—ఉట్టిమాటలు కాదోయ్! జరిపితీరాలి!

పెద్ది:—నీ కెందుకూ ఆ అనుమానం? అలా చెయ్యక పోతే నాపేరు పెద్దిభట్టేకాదు!

రామ:—భేష్! ప్రతిజ్ఞ అంటే అలా వుండాలి!

పెద్ది:—ఒరే! యీాజులూ! నువ్వు మంచివాడివి కావు. నాసంగతి మాత్రం యెక్కడా చెప్ప బోకు! నేనెక్కడికెళ్లినదీకూడా తెలుపవద్దు, నీకు పుణ్యం వుంటుంది.

3

## [ప్రవేశము: పెద్దిభట్టుభార్య కల్పలత, తల్లి]

తల్లి:—అమ్మా! ఎందుకమ్మా ఎప్పుడూ విచారిస్తూనే కూచుంటావు. మనవాళ్ళంతా ఎన్ని విధాలో ప్రయత్నించేరు; తిరగరాని చోట్లల్లా తిరిగేరు. అతనిజాడే తెలియదాయె. ఏంచేస్తాము తల్లీ! అన్నీ తెలిసినదానవు. విచారించి యేంలాభం? ఎంతకాలమని విచారించడం? కొంచెం ధైర్యంగా వుండు.

కల్ప:—ఏం ధైర్యమమ్మా! సర్వనాశనం చేసుకున్నాను. పదేళ్ళక్రితం ఆయన పండుక్కి యిక్కడికి వచ్చినప్పుడు నేను వినయంగా ప్రవర్తించలేకపోయాను. ఆయనకు బాగా కోపంవచ్చివుంటుంది. ఆ వెంటనే పరారిఅయిపోయినట్లు తెలిసిందిగదా! దీనికంతటికీ కారణం నేనేగదా! ఇప్పుడు పశ్చాత్తాప పడుతున్నాను. చేజేతులా చేసుకున్నదానికి కమిలిపోక ఏంచేయగలనమ్మా!

తల్లి:—జరిగిపోయినదానికి విచారమెందుకమ్మా! కొంచెం ధైర్యం తెచ్చుకోవాలిగాని. చీకటిపడు

తున్నాది మహాలక్ష్మిదగ్గర దీపారాధనచేసి, నాకు కాస్త మిరియాల కషాయంపెట్టు. దగ్గూ, జలుబూ తగ్గడంలేదింకా. తలనొప్పిగాకూడా వుంది.

[కల్పలత లోపలికిపోవును]

[అతిథి కావి గుడ్డలతో సన్యాసివలెవచ్చును]

అతిథి: నమః పార్వతీపతయే! అమ్మా! యీ పూట మీ యింట్లో యీ బ్రాహ్మడికి ఆతిథ్యం ఇప్పించగలరా! పరదేశిని.

తల్లి:-ఇంట్లో మగవారెవ్వరూలేరు. నాకు వంట్లో ఆరోగ్యంగానూలేదు. ఎక్కడనన్నా చూచుకోండి.

అతిథి:-చీకటిపడిపోయింది. కాళ్లు పీకుతున్నాయి. అడుగుతీసి అడుగు పెట్టలేకుండావున్నా. ఒకనాడా, రెండునాళ్లా! మూడునెల్లనుంచీ ఒకటే నడక! కాశీనుంచి నడిచిరావడం సామాన్యమా! మీ యింట్లో వీలులేకపోతే యేంచేస్తాము? కాస్త మంచితీర్థం యిప్పించండి. ఈ అరుగుమీద 'కృష్ణా! రామా!' అంటూ పడుక్కొని, బడలిక తీర్చుకుని ప్రొద్దున్నే వెళ్ళిపోతాను.

తల్లి:-ఏమిటీ! కాశీనుంచి వస్తున్నారా? నడిచే! అమ్మ! ఎంత పుణ్యాత్ములు! కాశీ వెళ్లకపోయినా, వెళ్లినవాళ్లని చూస్తేనే గొప్ప పుణ్యం అంటారు! మీలాంటివాళ్లు అభోజనంగావుండడం మాకు ఎంతో పాపం! కాళ్ళూ, చేతులూ కడుక్కొని సంధ్యావందనం చేసుకోండి. ఇంతలో ఏదోవంట జరిపిస్తా తిందురుగాని.

[భోజనాల వసారా. ప్రవేశము అతిథి కల్పలత - ఆమె తల్లియును]

తల్లి:-అమ్మాయీ! బాబుగారి సంధ్యావందనం అయింది. ఇక అన్నం, అవీ వడ్డించమ్మా!

[కల్పలత జంకుతూ, జంకుతూ వడ్డించును. అతిథి మెల్లమెల్లగా భోజనం చేయుచుండును.]

తల్లి:-బాబూ! నావంట్లో బాగులేక అమ్మాయి చేతనే వంట చేయించేను. వంట అలవాటులేనిది; చిన్నపిల్ల! పదార్థాలు బాగుండకపోయినా సర్దుబాటు చేసుకోవాలి!

అతిథి:-పదార్థాలన్నీ బాగానే వున్నాయండి! చాలా బాగా వంట చెయ్యగలదండి మీ అమ్మాయి!

తల్లి:-అమ్మాయీ! చారు కావలసినట్లుంది వెయ్యమ్మా! (అతిథితో) మా అమ్మాయి చారు బాగా పెట్టగలదు, మీరు రుచిచూచి ఎలాగుందో చెప్పాలి.

[కల్పలత చారు వడ్డించును: అతిథి కలుపుకొంటూ కిందికీ, మీదికీ చూచుచుండును]

అతిథి:-శ్లో॥ 'చారు చారు తరంభాతి
హింగూజీరా సమన్వితమ్,
కించిల్లవణలోపేన
పాలాశకుసుమం యథా' ♦

కల్పలత:-(వణకుచున్న చేతులతో చారు గిన్నెను అక్కడ పడవేసి లోపలికిపోవును. తల్లి కంగారుతో ఆమె దగ్గరికి వచ్చును.)

తల్లి:-ఏమే! అలా చేశావు! ఎందుకే అంత భయం! ఆయన ఏమనుకుంటారోగదా!

కల్ప:-(తలవంచుకుని) అమ్మా! మనం పోల్చుకోలేకపోయాము. ఆయన మరెవ్వరూకారు; మీ అల్లుడుగారే! నన్ను పరీక్షించడానికి కాబోలు యీ వేషంతో వచ్చారు నువ్వు బాగా చూడు.

♦ ఇంగువ జీలకఱ్ఱలతోకూడిన చారు, కొంచెం ఉప్పు తక్కువ కావడంచేత మోదుగుపువ్వువలె నిష్ప్రయోజనమయిపోయిందని భావము.

తల్లి:-(అతిథిని తేరిపారిచూచి, పోల్చి) నాయనా! పెద్దిభట్లూ! నువ్వేనాబాబూ! ఇలా సన్యాసివై పోయావేమిబాబూ! అయ్యో! అయ్యో! నాకళ్లుకాలా! నిన్ను యీ వేషంలో చూడ వలసివచ్చిందా! నాయనా! (కన్నులు తుడుచుకొనును)

అతిథి:-అత్తయ్యా! ఎందుకు దుఃఖిస్తారు! విధి కృతం! నేను సన్యాసం తీసుకున్నానని భ్రాంతి పడవద్దు. మీ యింటికి వచ్చినప్పుడు - మీ అమ్మాయి 'బాగా చదువుకుని రమ్మని నాకు బుద్ధి చెప్పింది. ఆమె ఆజ్ఞప్రకారం కాశీకి వెళ్లి చదువుకొని తిన్నగా యిక్కడికే వచ్చేశాను. నేను పాలాశకుసుమాన్నో, పరిమళ కుసుమాన్నో యిప్పుడు మీ అమ్మాయి గ్రహించగలదనుకుంటాను.

కల్ప:-(చేతులు మోకరించి) క్షమించాలి! ఈ పదేళ్లనుంచీ నాఅజ్ఞాన విలసితానికి కుమిలి కుళ్లిపోతున్నాను. ఇంతవరకూ చేసిన శాస్తి చాలును. క్షమించి అనుగ్రహించాలి!

తల్లి:-నాయనా! అశుభమూ, శుభమూ యెరగని అమాయకురాలు! చిన్నతనంనుంచి మాటతెన్ను సరిగా తెలియక తప్పుచేసివుండవచ్చు. నీకు యింత పట్టుదల వుందని తెలుస్తే అప్పుడే మా అమ్మాయిని నీ కాళ్లమీద పడవేశేదాన్ని.

పెద్ది:-నేను మొదటనే చెప్పానుగదా యిదంతా విధి విలసితమనీ! జరిగినదేదో జరిగిపోయింది! నేననుకున్నపని నెగవేరింది. యిక నేను యీ దీక్షను విడిచిపెడతాలెండి! మీ రెవ్వరూ యేమీభయ పడనక్కర్లేదు.

కల్ప:-(సంతోషంతో) ధన్యాస్మి ధన్యాస్మి. ♦

తల్లి:-నాయనా! మా అమ్మాయిని క్షమించి, దాన్ని జాగ్రత్తగా చూసుకో. కాస్త చదువుకున్నదనే మాటతప్ప లోకజ్ఞానం యేమీలేదు. నోరుజారి ఏదన్నామాటవస్తే పట్టింపు చెయ్యకుబాబూ!

పెద్ది:-ఇదివరలో మీ అమ్మాయి చదువుకున్నదనీ, నాకు విద్యలేదనీ కించపడేవాడిని. మీదయవల్ల ఇప్పుడు కాస్త సరస్వతీ కటాక్షంకలిగింది. ఇప్పుడు మా యిద్దరికీ జోడీ సరిపోతుంది. మా సంసారం తక్కినవాళ్ల సంసారంలాగ కాక తమాషాగా వుండగలదనుకుంటాను.

తల్లి:-తమాషాగా నన్నా వుండనీ! కాని నువ్వు యిక మీద ఇలాంటి తమాషాలు మాత్రంచేసి, దాన్నీ, మమ్మా అల్లరిపెట్టకు. (నవ్వును.)

※

[పెద్దిభట్లుఇల్లు. గదిలో నిలువుటద్దం ఎదురుగా కల్పలత కూర్చుని తలదువ్వుకొనుచుండును. పెద్దిభట్లువచ్చి అద్దానికి అడ్డముగా నిలుచును.]

కల్ప-వయస్సు ఎక్కువ వస్తున్నకొద్దీ మీరు కొంటె చేష్టలు ఎక్కువ నేర్చుకుంటున్నారు. నేను తల దువ్వుకొంటూవుంటే అలా అడ్డంగా రావడం బాగుందీ?

పెద్ది:-నువ్వేగాని నేను అద్దంలో నా అందం చూసుకోకూడదా యేమిటి?

కల్ప-(నవ్వుతూ) ఓ! ఈ ముసిలి ముఖానికి అందం కూడాను.

---

♦ ధన్యురాలనైతిని; ధన్యురాలనైతిని.

పెద్ది:_ముసలి ముఖంలో అందం లేదంటావా ?

శ్లో॥ పలితాని ముఖేందు మండలే
శకలానీతి విభావయామహే. ♦

నావర్ణన బాగులేదా ?

కల్ప:_(నవ్వుతూ, తల ఆడించి)

అతఏవ .నిమీల్యతే తరాం
తరుణీలోచనపద్మ సంతతిః. *

పెద్ది:_నీ అందానికి, నువ్వు నన్ను ఆక్షేపించడమే !

కల్ప:_నా అందానికి ఏమిటి తక్కువ ?

పెద్ది:_తక్కువయేమీ లేదు.

శ్లో॥ తింత్రిణీదళ విశాలలోచనా
నింబపల్లవ సమాన కుంతలా,
మేరుమంథర సమాన మధ్యమా
పెద్దిభట్ట గృహిణీ విరాజతే. *

కల్ప: (ముఖం చిట్లించుకుని) సరేలెండి ! గంతకు తగిన బొంత ! ఇక మీకు సంతుష్టేనా ?

పెద్ది:-ఇంకా వర్ణన పూర్తికాలేదే.

కల్ప:- కోపంతో) చాల్లెండి ! ఇక కట్టిపెట్టండి ! ఎవరన్నావింటే నవ్విపోతారూ. తన భార్యని యిలా వర్ణిస్తే తనకేనామోషీ అని తెలీదూ ?

పెద్ది:-(నవ్వుతూ) ఎలా తెలుస్తుందేమిటి ? పాలాశ కుసుమాన్నిగదా !

♦ ముఖంమీది పండువెంట్రుకలు చంద్రమండలంలోని (తెల్లని) శకలములంటూ మేము భావిస్తున్నాము.
* అది నిజమే. అంచేతే - ఆ చంద్రుడినిచూచి యువతుల కన్నులు అనేపద్మాలు ముడుచుకుపోతున్నాయి. (ముసలివాళ్లనిచూచి యువతులు కన్నులు మూసుకుంటారని భావము )
* చింతాకులవలె విశాలమైన కన్నులూ, వేపచిగుళ్ళవంటి ఎర్రనిజుట్టూ, మేరుమంధర పర్వతాల్లాగ లావైన నడుమూ కల పెద్దిభట్టు భార్య చాలా అందంగావుంది.




# తగిన శాస్తి

శ్రీ సి. హెచ్. శ్రీరామమూర్తి

పూర్వ కాలంలో రాజుల దర్శనానికి వెళ్లేవారు ద్వార పాలకులకు ఏదో కొంత (లంచం) ముట్టచెపితేనే కాని వారిని దర్బారులోనికి వెళ్లనిచ్చేవారు కాదు షహ రాజవాన్లు. ఒకసారి తెనాలి రామకృష్ణుడు శ్రీ కృష్ణదేవరాయల దర్శనానికి వెళ్లాడు. కాని సింహద్వారపు గేటు దగ్గరనున్న ద్వార పాలకుడు [redacted] రోజు బహుమానము తనకిస్తేనేకాని లోనికి పోనీయనన్నాడు. ఇకతప్పని సరియై రామకృష్ణుడు అందుకు వప్పుకొని రాజదర్బారులోనికి వెళ్లాడు.

దర్బారులోనికి వెళ్లి రామకృష్ణుడు తన చాతుర్యముచే రాయలవారిని మెప్పించాడు. రామకృష్ణుని కేమి కావలెనో కోరుకొమ్మన్నారు రాయలవారు. రామకృష్ణుడు 50 కొరడా దెబ్బలు కావలెనని కోరాడు. కృష్ణదేవరాయలింకేమైన కోరుకొనమని యెంత చెప్పినను వినక అవేకావలెనని కోరాడు రామకృష్ణకవి. సరేనని రాయలవారు తప్పని సరిగ తమకోశాధిపతికేర నొక ఉత్తరము నిట్లు వ్రాశాడు: 'ఇది పట్టుకవచ్చిన వారికి 50 కొరడా దెబ్బలు ఇమ్ము' అని వ్రాసి రామకృష్ణునకిచ్చారు.

రామకృష్ణుడా ఉత్తరమును తీసుకొని తనని లోనికిరాకుండ అడ్డగించిన ద్వార పాలకుడి వద్దకు వెళ్లి 'ఇదిగో ఈ రోజు నాకు వచ్చిన బహుమతి. దీనిని తీసుకొని కోశాధిపతి వద్దకు వెళ్లుము. నీకు బహుమతి ముట్టగలదు' అన్నాడు. ద్వారపాలకుడు సంతోషముతో లేఖనుతీసుకొని కోశాధిపతి దగ్గరకు వెళ్లాడు. పాపము అందులో వ్రాసిన విషయము వాడికేమి తెలియును! రాజాజ్ఞ ప్రకారము కోశాధిపతి వానిని 50 కొరడా దెబ్బలు కొట్టించాడు.

ఆ దెబ్బలు తిని వాడు ఏడుస్తూ పోయి రాజుగారితో ఫిర్యాదుచేశాడు. రాయలవారు రామకృష్ణుని పిలిపించి అడుగగా జరిగిన సంగతంతయు చెప్పివేశాడు. అది

విని రాయలు ద్వారపాలకుని కఠినముగ శిక్షించి రామకృష్ణుని సత్కరించిపంపాడు. పూర్వంరాజులెంత మెలకువగనుండి లంచ గొండులను శిక్షించినను అది నశింపక నేటివరకు మనలను పాలన చేయుట మన దురదృష్టమేకదా !

## కరణంగారి తెలివి

ఒక గ్రామంలో రామయ్య అనే కాపు వున్నాడు. రామయ్య కష్టజీవి, అమాయకుడు. రామయ్య భార్య గడుసరి.

కాపు దంపతులిద్దరూ సంజవేళ యింటికి బయలు దేరారు. రామయ్య భార్య కళ్లు హఠాత్తుగా ఒక చెట్టు కొమ్మపై వ్రేలాడుతున్న రతనాలహారమ్మీద పడింది. ఆ చుట్టుప్రక్కల చూసింది. కాని ఎవరూ కనపడలేదు. ఏపక్షో పట్టుకువచ్చి ఆ కొమ్మపైపడ వేసింది. రామయ్య భార్య రంగమ్మకు అదృష్ట వశాత్తున దొరకింది. అది తీసుకొని యింటికి బయలు దేరింది.

దండవిప్పి రత్నాలనన్నీ లెక్కించింది. అవన్నీ నూటతొంబైతొమ్మిది వున్నాయి. వాట్లలో నూరు రత్నాలనుతీసి రామయ్యకిచ్చి, కంసాలిచేత ఒక చిన్నహారం చేయించమంది. రామయ్య కంసాలికిచ్చి చక్కావచ్చేడు.

కంసాలి భార్య గయ్యాళి. రత్నాలహారం తనకు కూడా ఒకటి చేస్తేనే వుంటానని, లేకుంటే ఏనూతులోనోపడి చస్తానని బెదరించింది. కంసాలి భార్యకులొంగి ఆ దండను ఆమెకుచేసిపెట్టేడు. అటు వంటి రత్నాలు ఎక్కడ దొరుకుతాయి కనుక ! రాణులు ధరించేవారయె !

రెండురోజులు అయిన తరువాత రామయ్యవచ్చి అడిగేడు. కంసాలి ఏమీయెరుగనట్లు 'ఏమిటీ ! నువ్వు నాకు వంద రత్నాలు యిచ్చావా ! ఎం అబద్ధం ! ఒక రోజంటే రెండోరోజు వస్తుంటావు ! అంటూ దమాయించేడు. మిగతా వారంతా రా య్యని నానా చీవాట్లు పెట్టేరు.

పాపం ! రామయ్య వూరి కరణంగారిదగ్గ వెళ్ళి తనకు జరిగిన అన్యాయం చెప్పుకొని బావు మని ఏడిచాడు. కరణం జరిగినదంతా తెలుసుకొ మిగతా తొంబైతొమ్మిది రత్నాలు తెమ్మనిచెపి అవి కంసాలికిస్తూ 'ఇదో ! ఈ నూరు తీసుకుపో మా అమ్మాయికి ఒక దండచేసి త్వరగా తీసుకురా అంటూ చెప్పిపంపేడు.

కంసాలి యిల్లుచేరుకొని లెక్కచూసుకొన్నాడ తొంబైతొమ్మిదేవున్నై ! ఒకటి ఎక్కడో జ పోయిందనితలచి తన దగ్గరవున్న వందలో ఒక దీనిలోవేసి దండచేసి యిచ్చేడు.

మర్నాడు కంసాలిని, రామయ్యని, మిగ పిలపించి పెద్దసభచేశాడు. సభలో కరణం నించొని "అయ్యలారా ! రామయ్యకాపు క లికి వందరత్నాలిచ్చి దండ తయారుచేసి యి మన్నాడు. కంసాలి వాటినపహరించి, యివ్వ దంటూ దమాయించేడు !" అంటూవుండగానే కులు 'రామయ్య కెక్కడివి ?' అని, 'బుజువేలా' అని గోలచేశారు.

కరణంగారు జరిగినకథంతా తెలుపుతూ "కం లికి నేను 99 యిచ్చినేపుడు 100 ఎలా అయ్యాయి?. అంటూ బోధపరిచారు.

కంసాలికి శిక్షవిధించి రామయ్య రత్నా రామయ్య కిప్పించారు కరణంగారు.

చూశారా ! బాలలూ ! ఆ రోజులలో కారులు ఎంత తెలివితేటలుగలవారో ! ఇప్పుడు అ జరిగితే రామయ్యకేశిక్ష వేస్తారేమో నేటి న్యాయ కారులు ! !

పిల్లా సుబ్బారావ్ శాస్త్రి

(8 పేజీ తరువాయి)

అందమైన దాన్ని చేసికొని ఏం సుఖాలను భవించమంటావు? అవయవ లోపం లేకుండా చూచుకోవాలి. గుణం చూడాలి. కానీ అందాన్ని ఎంచుకోవద్దనను. కేవలం 'ఒక్క' అందంపై ఆధారపడడం నాకే మాత్రం ఇష్టంలేదు. మన వసంత మొగుణ్ణి చూస్తే కంట్లో మిరప్పొడి చల్లినట్లుంటుంది నాకు. అందమైనవాడు. అందంచూచి నాన్న వద్దంటూన్నా, అమ్మవినక ఆ సంబంధం చేసింది. వాసంతి ఏం సుఖపడుతోంది అడుగు. నాకునీసంసారం నచ్చింది. మూర్తి నీలాగా నాలాగ అందమైన వాడుకాడు, కానీ అతనిగుణం చాలామంచిది. అన్నీ ఒకరియందు పెట్టడు విధి. అందమిస్తే గుణమివ్వడు, గుణమిస్తే అందమివ్వడు.''

అనూరాధ ఇహవినలేకపోయింది. బావురుమని ఏడ్చేసింది. ''అన్నా! నేను సుఖంగా వారితో మనసిచ్చి కాపురం చేస్తున్నానని అనుకొంట్టున్నావా! నేనూ తుచ్ఛమైన అందానికి లోబడి వార్ని ఎంతో బాధపెట్టాను. మొదట నాతో మాట్లాడను వారికి అభిమానంగావుండేది. కానీ ఎంతో లాలించేవారు. కానీ...నాసుఖాన్ని వారి గుణాన్ని అన్నీ నిరసించాను. నామీదనీకు చాలా మంచి అభిప్రాయంవున్నందుకు చింతిస్తున్నాను. నీవంటిగుణమే నీచెల్లెలికి వుందని అపోహపడ్డావు,'' అన్నది

చిన్నన్న ఆశ్చర్యంలో మునిగాడు ''అదా'' అనిమాత్రం అనగల్గాడు.

అనూరాధ రెండుచేతులతో ముఖం కప్పుకొని ఏడుస్తోంది.

చిన్నన్న అనూరాధ చేతులు విడ తీసాడు. ''అమ్మా! ఏడవకూడదు. తప్పు చేసినవారు తమ తప్పుని తెలుసుకొని పశ్చాత్తాపపడడమే ప్రాయశ్చిత్తం. అంతకు మించిన శిక్షలేదు. నీభర్తనిన్ను క్షమిస్తాడు తప్పక నీ కాపురాన్ని సరిదిద్దుకొని నడుస్తానని మాటివ్వు నాకు'' అన్నాడు.

అనూరాధ ఏడ్పునిలిపింది. చిన్నన్న మరలా చెప్పాడు ''అందముమీద ఎవరికీ మమతలేదనను; కానీ తీరా పెండ్లి అయింతర్వాత నీవు దుఃఖస్తో కృంగుతో అటూ నీ ప్రాణానికి, ఇంకో వ్యక్తిని కృంగిస్తూ వుండడం మాత్రం మంచిదికాదు. హైందవ స్త్రీలకు భర్తేదైవమని నీకు తెలీంది కాదు. ఇలానే వుంటేనీకాపురం ఏమయి పోతుందిచూడు; మూర్తి మొగవాడు. సంఘాన్నెదిరించి ఇంకో అందమైన వాణ్ణే నీవు పెళ్లాడగలవా; చెప్పు? ఆపని మూర్తి చెయ్యగలడేమోకాని నీవు చేయగలవా?''

అనూరాధకి కంపరమెత్తింది ''ఛీ'' అన్నది.

చిన్నన్న నవ్వాడు ''ఆం...చూసావా? నీవు సంస్కారంగల ఆడదానివి. నీతప్పు తెలుసుకొన్నావు. దిద్దుకో ఇది నా సంక్రాంతి సందేశం'' అన్నాడు చిన్నన్న. సంక్రాంతి సందేశాన్నందుకొని అనూరాధ అత్తింటికెళ్లింది.



# రాజీ -

నా [illegible]ం...

కన్నులవిందు వీనులవిందు
కావించే కమనీయ
చిత్రం...

# జెమిని
నిర్మాణం

జనవరి 30 వ తేదీన
ఆంధ్రదేశమంతటా
విడుదల కానున్నది






**తేనెసోనలు (తృతీయ మధుకోశము) : విద్వత్కవిభూషణ విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మగారు, 66 సామిపిళ్లెవీధి, చూళ, మద్రాసు 7. వెల రు 1-4-0**

తేనెసోనలు మొదటి, రెండవ మధుకోశములవలెనే అత్యంత మనోరంజకముగా మూడవదికూడ వెలువడినది. ఇందలి ఖండకావ్యములు భావ, రసపోషణలతోబాటు మృదు, మధురశైలిలో మనోజ్ఞంగా నొప్పుచున్నవి. గ్రంథకర్త పండితులేకాక ప్రజాసామాన్యపు అభిరుచుల ననుసరించి సలక్షణమైన కవిత్వమును చెప్పకలిగిన కవివరేణ్యులు.

ఈ గ్రంథము సర్వప్రజానీకపు ఆదరాభిమానములకు పాత్రముకాగలదనుటకు సందేహము లేదు.

**ముముక్షుచరిత్రము : కామరాజు సింగరిదాసుగారు. ప్రాక్ ప్రతీచీ గ్రంథాలయము, రాజమహేంద్రవరము. వెల రు 1 0-0**

ఇందులోనిపాటలు భగవద్భక్తిపరులకు భగవన్నామ సంకీర్తనకు, మానవప్రబోధానికి, విజ్ఞాన వికాసముల వ్యాప్తికి ఎంతైనా అనువుగా నున్నవి.

గానసుధారసంతో యిట్టి ఉత్తమ ఆదర్శలక్ష్యాల సాధనకని ఉద్దేశించిన యీ గ్రంథమందలి కీర్తనలు రక్తిని, ముక్తినికూడ ప్రోత్సహించగలవని మా నమ్మకం.

**సోమశేఖరీయము (సభారంజన శతకము) విద్వత్కవిభూషణ విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మగారు, 66 సామిపిళ్లెవీధి, చూళ, మద్రాసు 7. వెల 0-5-0.**

ఇది నీలకంఠ దీక్షిత ప్రణీతమయిన సంస్కృత నీతిశాస్త్రరత్నావళికి అనువాదము. అనువాదమయినను స్వేచ్ఛావాతావరణంలో చక్కని భావసంపదతో మనోహరంగా నడిచిన రచన.

ఇప్పటి కవులలో మృదుమధురకవిత్వాన్ని సరళమైనశైలిలో రచించి పండిత పామరుల మన్ననలనందుకొంటున్న కవివరేణ్యులలో శ్రీ శర్మగారొకరనుటకు యీ చిన్న పుస్తకము సయితము నిదర్శనము.

ఈ చిన్న గ్రంథము శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి అంకితము చేయబడుటచే ప్రతి పద్యము యొక్క చివరి పాదము వారి నామసంబోధనతో ముగియుచున్నది.

ఇట్టి మహోత్తమమయిన రచనానైపుణ్యంతో అమోఘంగా భాషాసేవచేయుచున్న శ్రీ శర్మగారు యింకా అనేక రచనలుచేసి ఆయురారోగ్యములతో వర్ధిల్లాలని మా ఆశ.

యజ్ఞఫలము : బులుసు వేంకటేశ్వర్లుగారు, రామారావుపేట, కాకినాడ. రు 2-0-0.

ఇది భాసకవి ప్రణీతమయిన "యజ్ఞఫల" మను సంస్కృత నాటకమునకనువాదము. ఇందలి కథావస్తువు దశరథుని యజ్ఞఫలముగా శ్రీ రామాదులు పుత్రులుగా జన్మించుట, విశ్వామిత్రుని యజ్ఞఫలంగా శ్రీ రామాస్త్ర పరిగ్రహణం, జనకుని యజ్ఞఫలంగా శ్రీ సీతారాముల కల్యాణము కాబట్టి యీ నాటకమునకీ నామము చాల ఒప్పియున్నది.

స్థూలంగా యిందలి కథావస్తువు రామాయణం. రచన ఆద్యంతంగా నడిచి పాత్రపోషణ మొదలగు ఉత్తమ లక్షణ సమన్వితంగా యీ గ్రంథము మూలమును అనుసరిస్తూ నడిచింది. ఈ గ్రంథపఠనము భాషా సంపదతో బాటు ఆనందపరచగలదు. ఉత్తమనాటక రచనకు ప్రయత్నపూర్వకమైన కృషి చేయువారికీ గ్రంథము మార్గదర్శకము కాగలదు.

---

# సంపాదకీయములు

## సంగీతము – ప్రభుత్వాదరణ

మదరాసు నగరమందు జరిగిన అఖిలభారత సంగీతకళావిద్య మహాసమ్మేళనమునకు ప్రారంభోత్సవము చేయుచు కేంద్రమంత్రి శ్రీ కేస్కార్ సంగీతకళాభివృద్ధికి ప్రభుత్వము సహాయముచేయగలదని వాగ్దానము చేశారు. కాని బాణీలు వేరువేరైనా మొత్తముమీద కళాభివృద్ధికి సంగీతకళావిదులు ఐకమత్యంతో పరస్పర సహకార సద్భావములుకలిగి కృషిచెయ్యాలని ఉద్బోధించారు.

శ్రీ కేస్కార్‌గారు విశాలహృదయంతో సంగీతకళ అభివృద్ధి నుద్దేశించి పైవిధంగా చెప్పారు. కాని కర్ణాటక, హిందుస్థానీ మొదలగు బాణీలను, సాంప్రదాయముల ఆధిక్యతను గురించి ఎవరిమటుకువారు పెనుగులాడుచుండుట చూచుచున్నాము. వీరంతా ఎవరి సాంప్రదాయాలను, బాణీలను ప్రచారంచేసికుంటూ ఉమ్మడిగా సంగీతకళాభివృద్ధికి దోహదంచేయడం మూలంగా ప్రభుత్వ ఆదరణనుకూడ ఎదురుచూడవచ్చును.

సంగీతకళాభివృద్ధి సందర్భమున ముఖ్యంగా గమనించవలసినవి – అన్ని కళలతోబాటు సత్సాంప్రదాయాలతోటి సంగీతకళను క్షుణ్ణంగా నభ్యసించాలి. అట్టి అభ్యాసానికి అవకాశములు విస్తృతంకావాలి. శ్రోతలలో సంగీతకళపట్ల ఆసక్తి, అభిలాష పెరుగుటకుగాను కళాకేంద్రాలు, వాని మూలంగా కళాపోషణా జరుగాలి. దాని మూలంగా శ్రోతల అభిరుచులను గాయకులు తెలిసికొనడం, వాని ననుసరించి ఉభయులూ కళారాధన జరుపడం సాధ్యమగుతుంది. అంతేకాక కళాభివృద్ధితోబాటు సంగీతకళావిదులకు, శ్రోతలకు మధ్య మరింత సన్నిహిత సంబంధాలు సమకూరుతవి. ఇందుకుగాను ప్రజలూ, ప్రభుత్వముకూడ పరస్పర సహకారముతో కృషిచేసినచో సత్ఫలితాలకు కొరతయుండదు.

## ఆంధ్ర దేశంలో మద్యనిషేధం

నూతనంగా ఏర్పడిన రాష్ట్రంకావడంవలన ఆంధ్రదేశం అనేక సమస్యలతోబాటు ఆర్థిక సమస్యలను ఎదుర్కొనవలసి ఏర్పడింది. ఆదాయవ్యయాలను బట్టిలోటు రాష్ట్రంగానున్న కారణంచేత లోటును భర్తీ చెయ్యడంకొరకు మద్యపాననిషేధాన్ని రద్దుచేసి ప్రభుత్వాదాయాన్ని పెంచాలని కొందరి అభిప్రాయం.

మద్యపాననిషేధాన్ని చట్టంగా చేసేముందు జాతీయయుద్యమంలో నొకభాగంగా మద్యపానాన్ని అరికట్టేందుకు జరిగిన కృషి, స్త్రీలు, పురుషులు, చేసిన త్యాగములు మరువలేనివి. అదంతా త్రాగుడు వలన ఆర్థికంగా, నైతికంగా, శారీరకంగా పతనంచెందుచున్న కుటుంబ జీవితాన్ని ఉద్ధరించడానికని గాంధీజీ నాయకత్వము క్రిందజరిగిన జాతీయసమరంలో నొక భాగం. చివరకు విజయచిహ్నంగా మద్యపాననిషేధం చట్టంగా రూపొందింది.

ఈ మద్యపాననిషేధచట్టాన్ని రద్దుచెయ్యడమంటే ప్రతి జాతీయవాది మితిలేనిబాధ పడతాడు. కాని యిప్పుడు అమలునందున్న చట్టంమూలంగా మద్యపానం పూర్తిగా అరికట్టబడి, దానివలని సత్ఫలితాలు కుటుంబజీవితానికి అందుబాటులో నున్నవా ? అని ప్రశ్నిస్తే జవాబు చెప్పడం కష్టము. అటువంటప్పుడు ప్రభుత్వ ఆదాయం పడిపోయి వ్యక్తులలాభాలు అధికమయ్యేటప్పుడు యీ మద్యనిషేధచట్టంవలన లాభమేమిటి అనేది కూడ ఒక ప్రశ్నయే.

మద్య నిషేధచట్టాన్ని రద్దుపరచే విషయంలో విచారణ జరిపి నివేదికను సమర్పించడానికి శ్రీ శాంతిరామమూర్తిగారి అధ్యక్షతన జస్టిస్ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు, నీలరంగనాధంగారు సభ్యులుగా ఏర్పడిన సంఘం పరిపాలన దృష్ట్యా విచారించి తయారుచేయగల నివేదిక రాష్ట్ర శ్రేయస్సుకు వినియోగపడగలదని ఎదురు చూద్దాము!

## గ్రామాలకు వైద్యసాహాయం

మనదేశంలో ముఖ్యంగా గ్రామసీమల్లో వైద్యసహాయం చాలా తక్కువగానున్న పరిస్థితులలో ఆరోగ్య సౌభాగ్యాలను పెంపొందించడానికని ఇండియాప్రభుత్వ ఆరోగ్యశాఖ సూచించిన విధానము సలుసుఖాల విమర్శలకు గురియగుచున్నది. ఈ విధానము ననుసరించి మెట్రిక్యులేషను చదివినవారిని రెండేళ్ల శిక్షణతో గ్రామాలలో మెడికల్ అసిస్టెంటులుగ తయారుచేయడం.

అనారోగ్యమునుండి విముక్తులను చేయడం, ఆరోగ్యసౌభాగ్యాలను పెంపొందించడమనేది రెండు సంవత్సరాలకాలములో శిక్షణపొందు 'అల్పజ్ఞులైన డాక్టర్లు' సమర్ధనీయంగా నిర్వహించగల బాధ్యతలు కావని వైద్య శాస్త్రజ్ఞుల విమర్శ; పైగా అది క్షేమకరం కాదని వారి వాదం.

కాని యధాతధంగానుండు పరిస్థితులను దృష్టిలోనుంచుకొని చూచినచో యీ మెడికల్ అసిస్టెంట్ల వలన విశేషంగా మేలుచేకూరగలదని చెప్పవచ్చును. రెండు సంవత్సరముల కాలంలో గడించగల వైద్య శాస్త్ర పరిజ్ఞానము, అనుభవను యీ మెడికల్ అసిస్టెంట్లను సమర్ధనీయులగు వైద్యులుగా చేయక పోవచ్చును. కాని వారు ఆర్జించిన అనుభవవిజ్ఞానాలతో పరిపూర్ణమైన విజ్ఞానఅనుభవాల నార్జించిన సమర్ధులగు వైద్యుల అజమాయిషీ క్రింద గ్రామప్రజలకు వైద్య సహాయం విశేషంగా చేయడానికి అవకాశములున్నవి.

పైగా మనదేశం బీదదేశం. పరిపూర్ణులగు వైద్యులుగా తయారు కావడానికిగాని, లేదా అట్టి వైద్యులనుండి వైద్యసహాయం పొందుటకుగాని, తగిన ఆర్ధికస్థిమితంగలవారుగాని గ్రామీణులు బహు కొద్దిమంది. ఈ పరిస్థితులలో సూక్ష్మంలో మోక్షంలాగ దేశమొత్తంమీద అనుభవశాలురు, సమర్ధులగు వైద్యుల, సూచనలు సలహాలననుసరించి మెడికల్ అసిస్టెంట్లు గ్రామాలలో పని చేసినచో తప్పక పరిస్థితులు మెరుగు తేలగలవు.

---



---

## శ్రీ విజయనామసం॥ర పుష్య మాఘమాసములు.

| | | | |
|---|---|---|---|
| 1954 సం॥ జనవరి నెల | 16 | శ | ద్వా 7-40 మృ 53 43 వ ఉ 9-45 మొ 11-19 క సావిత్రిగౌరివ్రతారంభం |
| | 17 | ఆ | త్ర 4-50 ఆ 53-18 వప 12 25 మొ 2-0 క |
| | 18 | సో | చతు 2-56 పున 51-4 వసా 4-3 మొ 5-40 క పూర్ణిమచంద్ర గ్రహణం |
| | 19 | మం | ○ పూ 2-27 పుష్య 56-6 ది 14-55 త్యా 4-0 పవ 12-29 మొ 2 8 క |
| | 20 | బు | బహుళపాడ్యమి 3-18 ఆశ్రే 59-18 త్యా 4-13 వరా 6-29 మొ 8-10 క |
| | 21 | గు | విదియ 5 17 మఘ 60-10 త్యా 4-16 వరా 7 6 మొ 8-48 క |
| | 22 | శు | తదియ 6-20 మఘ 3-17 వసా 4-34 మొ 6-18 క |
| | 23 | శ | చ 12-11 పూఫ 8-21 వసా 5-48 మొ 7-32 క |
| | 24 | ఆ | పం 16-41 ఉఫ 13-58 వరా 9-24 మొ 11-10 క |
| | 25 | సో | ష 21 33 హ 19-58 వరా 11-22 మొ 1-8 శూన్యతిథిః |
| | 26 | మం | స 26-22 చి 25-55 వరా 11-4 మొ 12-49 సప్తమీతిథిః |
| | 27 | బు | అ 30-57 స్వా 31-40 వరా 1-20 మొ 3-4 క |
| | 28 | గు | న 35-4 విశా 36-47 వరా 1-39 మొ 3-22 క |
| | 29 | శు | ద 38-27 అనూ 41-31 వతె 5-8 మొ |
| | 30 | శ | ఏ 40-49 జ్యే 45 13 శేవ ఉ 6-4 క తిరిగివర్జ్యంలేదు సర్వోపవాసః |
| | 31 | ఆ | ద్వా 42-9 మూ 47-48 వ ఉ 9-0 మొ 10-40 క |
| 1954 సం॥ ఫిబ్రవరి నెల | 1 | సో | త్ర 42-12 పూషా 49-10 ది 12 21 వప 11-30 మొ 1-8 క |
| | 2 | మం | చతు 41-1 ఉషా 49 22 వప 10-15 మొ 11-51 |
| | 3 | బు | ● అమా 38-36 శ్ర 48-21 శేవ ఉ 7-48 క మహోదయపుణ్యకాలం |
| | | | **మా ఘ మా స ము** |
| | 4 | గు | శుద్ధపాడ్యమి 35 3 ధ 46-20 శేవ ఉ 7-12 క తిరిగివర్జ్యంలేదు మాఘస్నానారంభ |
| | 5 | శు | విదియ 30 31 శత 43-11 వ ఉ 7-53 మొ 9-24 క |
| | 6 | శ | తదియ 25-11 పూభా 39-23 శేవ ఉ 7-17 క తిరిగివర్జ్యంలేదు తృతీయాతిథిః |
| | 7 | ఆ | చ 19 19 ఉభా 35-8 వ ఉ 7-11 మొ 8-40 క తిథిద్వయం |
| | 8 | సో | పం 13-0 రే 30-37 వ ఉ 7-39 మొ 9-8 క |
| | 9 | మం | ష 6-34 అశ్వ 26-5 వప 1-14 మొ 2-43 క |
| | 10 | బు | స 0-26 ఏ ప్యా 54 3 వ భ 21-5 తె 2-31 మొ 4-1 క రథసప్తమీ |
| | 11 | గు | న 50 6 కృ వ తె 5-2 మొ మధ్యనవమీ |
| | 12 | శు | ద 46 8 రో 15-23 వసా 6-5 మొ 7-38 క |
| | 13 | శ | ఏ 47-14 మృ 13 34 వరా 8-13 మొ 9 48 క భీష్మైకాదశి |
| | 14 | ఆ | ద్వా 40 36 ఆ 12-51 వరా 11-44 మొ 1-21 క |
| | 15 | సో | త్ర 41-15 పున 13-24 వరా 8-4 మొ 9-43 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd. 15. Westcott Road, Royapettah, Madras.
Founder-Editor : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.

